# ఆంధ్ర ప్రదేశ్

అక్టోబరు, 1970    50 పైసలు




హైదరాబాదులో గాంధీజీ

★

వెనుకబడిన తరగతుల విచారణ సంఘం సిఫార్సులు

★

మైక్రోవేవ్ ప్రాజెక్టు

★

మతతత్వ నిర్మూలన

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 14 అక్టోబరు, 1970 సంచిక : 12

ఆశ్వయుజం – కార్తీకం, 1892 శా.శ.

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు




కవరుపేజీ: చిత్రకారుని దృష్టిలో దీపావళి (డిజైను: శ్రీ రహీం)

రెండవ అట్ట : జాతి జనకుడు గాంధీజీ: కొన్ని చారిత్రిక ఘట్టాలలో

మూడవ అట్ట : నాగార్జునసాగర్ పవర్ స్టేషన్.

చివరిఅట్ట : "రాళ్లెత్తిన కూలీ లెవ్వరు?"

**వెల : 50 పైసలు**

**సాలు చందా 6 రూపాయలు**

రిజిస్టర్డ్ నెం. 135

ఈ సంచికలో
రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు
తప్పని సరిగా
ప్రభుత్వానికి సంబంధించినవిగా భావించనక్కరలేదు.

# 'ఆచార్య దేవోభవ'

భారత మాజీ రాష్ట్రపతి, భారతీయ మహోపాధ్యాయుడు అయిన డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినం సెప్టెంబరు 5వ తేదీ. ఆతేదీతో ప్రారంభించి, కొన్ని సంవత్సరాలుగా, దేశమంతటా ఉపాధ్యాయ వారోత్సవాలు జరుపుకుంటున్నాం. ఈ యేటితో ఆయన వయస్సు 82 సంవత్సరాలు. ఉపాధ్యాయులపట్లా, వారి సర్వతోముఖ అభివృద్ధి పట్లా ఆయనకు గల ప్రేమాభిమానాలకు చిహ్నంగా ఆయన జన్మదినంతో ప్రారంభమై యీ వారోత్సవాలు జరుగుతున్నవి. ఇదే విధంగా శ్రీ జవహర్‌లాల్ నెహ్రూకు పిల్లలపట్లగ ప్రేమాభిమానాలకు చిహ్నంగా, అయన జన్మదినం నవంబరు 14 వ తేదీన బాలబాలికల దినోత్సవం జరుపుకుంటున్నాం. ఉపాధ్యాయ వృత్తిలోనివారు అనేక ఉన్నత పదవులను అధిష్ఠించారు. అంతకంతకు ఎక్కువగా విజ్ఞాన సముపార్జన చేయాలనే నిరంతర దీక్ష వున్నట్లయితే, వారికి ఏదీ అసాధ్యం కాదు. మరొక మహోపాధ్యాయుడు డా. జకీర్ హుసేన్ కూడా రాష్ట్రపతి పదవిని అలంకరించి సమర్థవంతంగా నిర్వహించారు.,

మన సాంఘిక వ్యవస్థలో ఉపాధ్యాయుడికి అత్యున్నత స్థానం వున్నది. తల్లిదండ్రుల తర్వాత స్థానం ఆయనదే. ఆయన సాక్షాత్తు దేవుని వంటివాడు. "మాతృ దేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ" అన్నారు. అలాగే "గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః గురుస్సాక్షాత్పరబ్రహ్మః" అని మన సంప్రదాయము. ఇంతటి ప్రాధాన్యం ఎందుకు అంటే, రేపటి పౌరులైన నేటి పిల్లల భవిష్యత్తును తీర్చి దిద్దేది ఉపాధ్యాయుడే.

కాని నేడు మన దేశంలో, పూర్వ కాలంలోలాగా ఉపాధ్యాయులపట్ల తగిన గౌరవ మర్యాదలు చూపబడటం లేదు. ఇది నిజంగా విచారించదగిన విషయం. దీనికి ఎవరు బాధ్యులు? విద్యార్థులా, ఉపాధ్యాయులా లేక ఉభయులా? లేక రకరకాల పరిస్థితులను కల్పించి కాలం చేసిన కుట్రా యిది?

ఉపాధ్యాయుడికి, తాను బోధించే విషయంలో తగిన సామర్థ్యం వుండి, దానిని అందంగా, ఆకర్షణీయంగా పిల్లలకు చెప్పగలిగితే, విద్యార్థులు ఆయన చెప్పేది అత్యంత శ్రద్ధతో వింటారు. విద్యార్థులతో వ్యక్తిగత సంబంధాలు పెంచుకుంటూ, వారి సమస్యలను సానుభూతితో అర్థం చేసుకుని, ఆధిక్యతా భావాన్ని గానీ న్యూనతా భావాన్ని గానీ ప్రదర్శించకుండా వాటిని పరిష్కరించడానికి ప్రయత్నిస్తే విద్యార్థులు తమ ఉపాధ్యాయుని పట్ల గౌరవ విధేయతలు కలిగి వుంటారు. నిజాయితీతో కష్టపడి పనిచేసే ఉపాధ్యాయుణ్ణి విద్యార్థులు దేవుడిలా పూజిస్తారు. ఆయనపట్ల అత్యంత ఆదరాభిమానాలు ప్రదర్శిస్తారు. పాఠాలు సరిగా చెప్పలేని ఉపాధ్యాయుడంటే పిల్లలు అంతగా పట్టించుకోరు. దీనివల్ల వారు అల్లరిచేయడం, క్రమశిక్షణకు భంగం కలగడం జరుగుతుంది.

ఉపాధ్యాయుడు, నిజానికి, జీవితాంతంవరకు విద్యార్థే. ఆయన ఎప్పుడూ తెలుసుకున్నంతతో తృప్తి పడకూడదు. సత్యాన్వేషణ, విజ్ఞాన సముపార్జన నిరంతరంగా చేస్తూ వుండ వలసిందే. పెరుగుతున్న విజ్ఞానంతోపాటు తానుకూడా పెరగాలి. బోధనకు సంబంధించిన ఆధునిక విధానాలను అవగాహన చేసుకుని అవలంబించాలి. తాను బోధించే విషయానికి సంబంధించి జరిగిన అభివృద్ధిని తెలుసుకోడానికి వీలుగా గ్రంథాధ్యయనం చేస్తూ ఎంతమంది ఉపాధ్యాయులు తమకున్న విజ్ఞానాన్ని పెంపొందించుకుంటున్నారు?

ఉపాధ్యాయుల హోదా పెంచడానికి మన రాష్ట్రంలో కృషి జరుగుతున్నది. ఇటీవల వారి జీతభత్యాలు పెంచడం జరిగింది. వారు తమ విద్యాయోగ్యతలు పెంచుకోడానికి వీలుగా సౌకర్యాలు కల్పించబడుతున్నవి.

సంఘంలోవున్న వివిధ వర్గాల ప్రజల్లో ఉపాధ్యాయ వృత్తిలో వున్నవారు ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమించి వున్నారు. మారుమూల కుగ్రామాలలో సైతం వుండే వీరు ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దడంలో ప్రముఖపాత్ర వహిస్తారు. విజ్ఞానబోధ చేయడమే కాకుండా, ప్రజలకు సరియైన సమాచారం అందించడం ద్వారా కూడా ఉపాధ్యాయులు సమాజానికి సేవ చేయవచ్చు. విషయ పరిజ్ఞానం కలవారు గనుక రాష్ట్ర అభివృద్ధి కృషిలో వారు కీలకమైన పాత్ర వహించి పని చేయవచ్చు. అధ్యాపక వృత్తి అతిగౌరవనీయమైన వృత్తిగా పరిగణింప బడుతున్నది. మేధా సంపన్నులైనవారూ, కార్యోత్సాహం కలవారూ యీ వృత్తిలో ప్రవేశించవలసిన అవసరంవుంది. అప్పుడే, రాబోయే తరంవారి విజ్ఞాన స్థాయి పెరగడానికి అవకాశం వున్నదని మనం ఆశించవచ్చు. ఏటేటా ఉపాధ్యాయ వారోత్సవాలు జరుపుకుంటున్న సందర్భంగా ఉపాధ్యాయుల, విద్యార్థుల సమస్యలపై దృష్టి కేంద్రీకరించడానికీ, యీ ఉభయ వర్గాల మధ్య పరస్పర అవగాహన పెంపొందించడానికీ కృషి జరగాలి.

**పి. వి. ఆర్**

# మనమీద మనం ఆధారపడి ముందుకు వెళ్లుదాం



— కాసు బ్రహ్మానందరెడ్డి

స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ముఖ్యమంత్రి రేడియో ప్రసంగం

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి యిరవై మూడేండ్లయింది. ఆనాడు మన స్వాతంత్ర్య పోరాటం స్వరాజ్యమనే లక్ష్యానికి అంకితమై అనేక కష్టనష్టాలతో, కారాగార వాసాలతో గడిచి పోయింది. నేడు ప్రజలను ఆర్థిక దాస్యబంధాల నుండి విముక్తుల్ని చేయడం మన ప్రధాన కర్తవ్యం. అశేష ప్రజానీకం యొక్క జీవన పరిస్థితి మెరుగుపడడానికి వీలుగా మన ఆర్థిక వ్యవస్థను చైతన్యవంతం చేయడానికి కృషి జరుగుతున్నది. పెద్ద బ్యాంకుల జాతీయకరణ వంటి అనేక సంక్షేమ కార్యక్రమాలను భారత ప్రభుత్వం అమలు పరుస్తున్నది. పాలకవర్గంలో వున్న పార్టీవారు యీ విషయమై ఎంతగా శ్రద్ధతీసుకుంటున్నారో వీటిని బట్టి సులభంగా గ్రహించవచ్చు.

## అగ్ని పరీక్షలు

ఇటీవలి కాలంలోనే అగ్ని పరీక్షల వంటి అనేక దుస్సంఘటనలను మనదేశం ఎదుర్కోవలసివచ్చింది వాటిని విజయవంతంగా ఎదుర్కొని పరిష్కరించుకోగలిగాం మన భవిష్యత్తుపట్ల మనకుగల విశ్వాసం అచంచలమైనది కాబట్టి, కుల, మత, ఆర్థిక వ్యత్యాసాలులేని నవభారత నిర్మాణం అనే మనలక్ష్యం తిరుగులేనిది కాబట్టి ఎన్ని అగ్నిపరీక్షలైనా మనం తట్టుకోగలం దురదృష్ట వశాత్తు దేశంలో కొన్ని ప్రాంతాలలో మతకలహాలు చెలరేగాయి, మరికొన్ని చోట్ల యింకోరకమైన హింసా కాండ తలఎత్తింది. అయినా మళ్లీ ప్రశాంత పరిస్థితి నెలకొన్నందుకూ, ఆ ప్రాంతాల ప్రజలు పరిస్థితులను గ్రహించి సఖ్యతతో మెలగుతున్నందుకూ సంతోషంగా వున్నది.

## మతకలహాలు మనకు లేవు

మత కలహ సంబంధమైన సంఘటనలు ఆంధ్రప్రదేశ్‌లో లేకపోవడం మన అదృష్టం. వివిధ మతాలకూ, భాషలకూ చెందిన అన్ని వర్గాల ప్రజలు మనరాష్ట్రంలో ఎల్లప్పుడూ ప్రశాంతజీవనం గడుపుతున్నారు. మతాతీత సాంఘికవ్యవస్థ, సోషలిజం, ప్రజాస్వామ్యం ప్రధాన లక్ష్యాలుగా గల మన ప్రభుత్వంక్రింద తమకు శాంతిభద్రతలు లభిస్తున్నాయని మత, భాషా సంబంధమైన అల్పసంఖ్యాకవర్గాల ప్రజలు భావిస్తున్నారు మన ప్రధాన మంత్రి పేర్కొన్నట్లు మనకు సహనంలో, సహజీవనంలో విశ్వాసం వున్న మాట నిజమే కాని అన్యాయం జరిగినా, హత్యలు జరిగినా, అసత్యప్రచారం జరిగినా, దేశంలో కొందరు ప్రచారంచేస్తున్న విషపూరిత వాతావరణం ఏర్పడినా మనము సహనాన్ని కోల్పోతాము. ప్రగతి సాధించడానికి దగ్గరదారి అంటూ ఏదీ లేదు. ప్రధానమంత్రి పేర్కొన్నట్లు నిజమైన దగ్గరదారి ఒక్కటే వున్నది. అదేమిటంటే సమర్థవంతంగా పనిచేయడం, మనమార్గమేమిటో, విధానమేమిటో స్పష్టంగా గ్రహించడం. ఒక నిర్దిష్ట కార్యక్రమం తయారు చేసుకోవడం, దానిని త్వరితగతిలో అమలు పరుచుకునే శ్రద్ధతో కృషిచేయడం. ఇదొక్కటే మనకున్న

దగ్గరదారి. ప్రజాస్వామ్యమార్గాన్ని విడిచి అడ్డదారులు తొక్కడం వల్ల దగ్గరదారి దొరకదు. ప్రజాస్వామ్యాన్ని భగ్నం చెయ్యడానికి ఉద్దేశించి ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్యం అని అంటూవుంటారు ఇది నిజంగా శోచనీయమైన విషయం. పత్రికా స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగ పరచుకోవడానికి పత్రికా స్వాతంత్ర్యం అనే విషయం గురించి మాట్లాడుతూ వుంటారు. స్వాతంత్ర్యోద్యమకాలంలో పత్రికలు అగ్రశ్రేణిలోవుండి పోరాటంలో పాల్గొన్నాయి. అచంచలమైన దృఢవిశ్వాసంతో పనిచేశాయి. అదేవిధంగా నేడు కూడా దేశం అన్నిరంగాలలో ప్రగతి సాధించే కృషిలో పత్రికలు తమ బాధ్యతలను నిర్వహిస్తాయనడంలో నాకు ఏ మాత్రం సందేహంలేదు.

## నూతన అధ్యాయం

భాషా ప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతం అనుసరించి ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నాలుగు కోట్ల తెలుగు ప్రజలను ఏకం చేసింది. తెలుగు ప్రజల చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది. అన్నిరంగాలలో సమగ్రంగా, సమానంగా అభివృద్ధి సాధించు కోవాలనే లక్ష్యంతోనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాణం జరిగింది. కొద్దికాలంపాటు తప్ప, తెలుగు ప్రజలందరూ చరిత్రలో ఎప్పుడూ ఒకే రాజకీయ వ్యవస్థలో వుంటూవచ్చారు. విస్తృత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు, లోగడ వున్న రాజకీయ ఐక్యతను పునరుద్ధరించడానికి జరిగినట్టిదే.

## సంగమ స్థానం

భౌగోళికంగానూ, సాంస్కృతికంగానూ ఉత్తర దక్షిణ ప్రాంతాల సంగమ స్థానంగా ఆంధ్రప్రదేశ్ తన బాధ్యత నిర్వహించవలసివున్నది. దేశంలో అనేక ప్రాంతాలలో ఎన్నో ఒడుదుడుకులు ఏర్పడినప్పటికీ, అనేకచోట్ల మంత్రివర్గాలు తారుమారవుతున్న సమయాల్లో కూడా ఆంధ్రప్రదేశ్‌లో స్థిరత్వం చెక్కుచెదరకుండా వున్నది. వరదలు, తుఫానులు, కరువు కాటకాల వంటి ప్రకృతి సంక్షోభాలు, మరికొన్ని మానవకల్పిత సంక్షోభాలు ఏర్పడినందువల్ల పరిస్థితి కొంచెం దెబ్బతిన్నప్పటికీ ప్రగతి మార్గంలో పయనించాలనే దృఢ నిశ్చయానికి ఏ మాత్రం ఆటంకం కలుగలేదు.

## మనమీద మనం ఆధారపడే దశ

ఆంధ్రప్రదేశ్‌లో భారీ సేద్యపు నీటిపారుదల పథకాలవల్లా విద్యుచ్ఛక్తి పథకాలవల్లా ఫలితాలు లభించే పరిస్థితి ఏర్పడింది. అందువల్ల మనమీద మనం ఆధారపడి ముందుకు వెళ్లేదశలో ప్రవేశించబోతున్నాం. వీటిలో అత్యంత ప్రధానమైనది నాగార్జునసాగర్ ప్రాజెక్టు. అలాగే తెలంగాణాకు జీవనాడి అని చెప్పదగిన పోచంపాడు ప్రాజెక్టుక్రింద 40 వేల యకరాలకు అనుకున్న దానికంటే ముందుగానే సేద్యపు నీరు విడుదల చేయడం జరిగింది. ఈ ప్రాంతపు అభివృద్ధి కృషిలో యీ ఘట్టం సువర్ణాక్షరాలలో లిఖించదగినట్టిది. తెలంగాణా ప్రాంతీయ సంఘం ఉత్తరువును సవరించి దాని అధికార పరిధిని విస్తృతపరచడమూ, తెలంగాణాకు బడ్జెట్ ప్రతిపాదనలను ప్రత్యేకంగా చూపే అవకాశం కల్పించడమూ జరిగింది. వీటివల్ల తెలంగాణా ప్రాంతానికి కొత్త జీవం పోసినట్లయింది. విశాఖపట్టణంలో ఉక్కుకర్మాగారం మనం సాధించిన విజయాలలో విశిష్టమైనది. అలాగే తెలంగాణా ప్రాంతంలోని రామగుండంలో రు 75 కోట్ల ఖర్చుతో నిర్మించే ఎరువుల ఫ్యాక్టరీ పది పన్నెండువేల మందికి ఉపాధి కల్పిస్తుంది. ఇది తెలంగాణాకు వరప్రసాదం వంటిదేకాక రాష్ట్రమంతటికీ ప్రయోజనకరమైనది. అదేవిధంగా హైదరాబాదులో ఎలక్ట్రానిక్ పరిశ్రమల కేంద్రీకరణ, హిందూస్తాన్ కేబిల్స్ ఫ్యాక్టరీ నిర్మాణమూ అత్యంత ప్రధానమైనవి. ఈ ప్రాంతంలో పబ్లిక్ రంగంలో రు 100 కోట్లు, ప్రైవేటు రంగంలో రు. 70 కోట్లు పెట్టుబడితో పరిశ్రమలు వెలసినవి. వాటితోడు కొత్త పరిశ్రమలు కూడా రావడంతో యీ ప్రాంతపు ఆర్థికవ్యవస్థ బాగా బలపడుతుంది. విశాఖపట్టణంలో జింకుశుద్ధికర్మాగారం, భారత్ హెవీ వెసల్స్ ప్లేట్స్ పరిశ్రమ, రు. 35 కోట్లు ఖర్చయ్యే హార్బరు ప్రాజెక్టు యివన్నీ రాష్ట్ర అభివృద్ధి యాత్రలో ముఖ్యమైన సోపానాలు.

## వంశధార ప్రాజెక్టు

వెనుకబడిన ప్రాంతమైన శ్రీకాకుళం జిల్లాలో వంద ఏండ్లుగా కలలుగంటున్న వంశధార ప్రాజెక్టు పని ప్రారంభమైనందుకు నాకు ఎంతో సంతోషంగావుంది. అలాగే డెల్టా జిల్లాలలో యింటింటా దీపం వెలిగించిన మహానుభావుడు సర్ ఆర్థర్ కాటన్ పేరు మీద గోదావరి నదిపై కొత్త బ్యారేజికి శంకుస్థాపన జరగడం కూడా యిటీవలి ఒక ముఖ్య సంఘటన. వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో ఒక ఉత్తేజాన్ని కలిగించిన 1970 సంవత్సరం, తెలుగు ప్రజల స్మృతిపథంలో చిరస్థాయిగా వుంటుంది. 20 లక్షల ఎకరాలకు పైగా ప్రభుత్వ బంజరు భూములు పేదవారికి పంపిణీ చేయడం జరిగింది. దేశంలో ఏ రాష్ట్రంలోకూడా యింత ఎక్కువగా బంజర్ల పంపిణీ చేయడం జరుగలేదు. దీనివల్ల 8 లక్షల కుటుంబాల వారికి లాభం చేకూరింది. అదేవిధంగా 1969-70 సంవత్సరం చివరకు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన వర్గాల ప్రజలకు యిండ్లస్థలాలు యివ్వడానికి సుమారు రూ $2\frac{1}{2}$ కోట్లు ఖర్చుజరిగింది. శిఖాయి జమాదార్ల బాపతు 24 వేల ఎకరాల భూమికూడా భూమిలేని పేదవారికి యివ్వబడింది. రైతుల పరపతి సౌకర్యం కూడా బాగా పెరిగింది. 1970-71 రు. లో 25 కోట్ల మేరకు దీర్ఘకాలిక ఋణాలు యివ్వబడినవి. గత సంవత్సరం యీ మొత్తం రు. 19 కోట్లు. స్వల్పకాలిక ఋణాల మొత్తం కూడా రు. 25 నుండి యీ సంవత్సరం రు. 42 కోట్ల వరకు పెరుగుతుంది.

## నక్సలైట్లు

చైతన్యవంతమైన నూతన విధానాలతో అభివృద్ధి కృషి సాగించాలని ఆంధ్రప్రదేశ్ కృషిచేస్తున్నది. శ్రీకాకుళం జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో భయోత్పాతం సృష్టించిన నక్సలైట్ కార్యక్రమాలు యిప్పుడు పూర్తిగా అదుపులోకి వచ్చాయి. ఆ ఉద్యమం

ముఖ్యనాయకులు పోరాటంలో మరణించారు. కొందరు అరెస్టు అయ్యారు. ముఠాదారీ పద్ధతి రద్దుచేయడం, కొండజాతి ప్రజల భూములు యితరులు కొనరాదని నిషేధించడం, ఋణబాధల నుండి తప్పించడం, ఆశ్రమాల తరహాలో పాఠశాలలు ప్రారంభించడం, కొండజాతి ప్రజలు విక్రయించే సరుకుల ధరలు పెంచడం మొదలగు అనేక ప్రత్యేక చర్యలు తీసుకోవడం ద్వారా అక్కడి ప్రజలకు ప్రయోజనకరమైన కృషిజరిగింది.

## తెలంగాణాకు సహాయం

వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిపరచడం. ఆర్థికంగా వెనుకబడివున్న ప్రజల పరిస్థితి మెరుగుపరచడం మన ప్రత్యేక బాధ్యత. రాయలసీమ ప్రణాళిక అభివృద్ధి సంస్థ ఏర్పాటు, ఆ ప్రాంతానికి రు 4 కోట్ల కేటాయింపు యీ ఉద్దేశంతో తీసుకున్న చర్యలే. తెలంగాణా ప్రాంతపు ప్రత్యేక అభివృద్ధికోసమూ, ఆ ప్రాంతపు సాధక బాధకాల నివారణ కోసమూ ప్రధానమంత్రి ప్రతిపాదించిన అష్టసూత్ర ప్రణాళిక అమలు జరిగిన తీరుకు ప్రధానమంత్రి సంతృప్తి వెల్లడించడం నాకు సంతోషం కలిగించింది. అన్నిరంగాలలోనూ తెలంగాణాకు న్యాయంగా రావలసిన వాటా ముట్టేటట్లు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం చిత్తశుద్ధితో శాయశక్తులా కృషిచేస్తున్నది.

## చిన్నరాష్ట్రాలు ప్రగతికి ప్రతిబంధకం

కొన్ని చారిత్రిక కారణాల వల్ల ఒక ప్రాంతంలో తాత్కాలికంగా కొన్ని అనుమానాలు, అపోహలు ఏర్పడినప్పటికీ సమగ్ర ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి 14 ఏండ్లయింది. రాష్ట్రంలోని మూడు ప్రాంతాల ప్రజలు ఏకదీక్షతో ఏకాశయంతో ఐక్యమైనారు. భాషాప్రయుక్త రాష్ట్రాలు ప్రజాస్వామ్యం బలపడడానికి చాలా అవసరమని, నెహ్రూ తదితర దేశ నాయకులు భావించారు. అటువంటి భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడానికి ఆంధ్రప్రదేశ్ మార్గదర్శకమైంది. ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తుమీద యితర భాషా రాష్ట్రాల భవిష్యత్తుకూడా ఆధారపడివున్నది. అందువల్లనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి యీ విషయంలో ప్రత్యేకమైన బాధ్యత వున్నది. రాష్ట్రాలు బలంగా వున్నప్పుడే కేంద్ర ప్రభుత్వానికి కూడా బలం వుంటుందని నా నిశ్చితాభిప్రాయం. దేశ ప్రయోజనాలదృష్ట్యా కేంద్రం బలంగా వుండడం ఎంతో అవసరం. ఆంగ్లేయుల పాలనకాలంలో దేశంలో చిన్నచిన్న రాష్ట్రాలు ఎన్నో వుండేవి. దానివల్ల దేశం ఎంతగా బలహీనపడిందో మనకు అనుభవం ద్వారా తెలిసిన విషయమే. చిన్నచిన్న రాష్ట్రాలలో పెట్టుబడిదారీ శక్తులు, భూస్వామ్య శక్తులు ఆవరించుకుని ప్రజల సరియైన ప్రగతికి ప్రతిబంధకంగా తయారయ్యే ప్రమాదం వుంది. గడిచిన ఏడాది కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో శాంతి సఖ్యాలు తిరిగి ఏర్పడినవి. ఇది శుభ సూచకము. దీనివల్ల మనరాష్ట్రానికి వున్న పేరు ప్రతిష్ఠలు మళ్ళీ అందరి దృష్టినీ ఆకర్షించినవి. ఏ పేరుతో జరిగినా, ఏ రకంగా జరిగినా హింసా వాతావరణం ప్రజల అభివృద్ధికి ఆటంకము కలిగిస్తుంది. మన లక్ష్యాలను సాధించుకోడానికి సాంఘిక, ఆర్థిక ఆశయాలను సిద్ధింపచేసుకోడానికి శాంతియుత పద్ధతులలో కృషిచేయడమే ఏకైక మార్గం. సంఘంలో పురోగమించిన వర్గాల ప్రజలతో సరిసమానంగా వెనుకబడిన వర్గాల ప్రజలను అభివృద్ధిపరచడానికి వెనుకబడిన తరగతుల కమిషన్ వారి నివేదిక చక్కగా వుపకరిస్తుంది. ప్రజాస్వామ్య వ్యవస్థలోనూ ఎన్నికలలోనూ మనకు సంపూర్ణ విశ్వాసం వున్నది. మనం అనుసరించే విధానాలను గురించీ, కార్యక్రమాలను గురించీ అయిదేళ్లకు ఒకసారి ప్రజలు తీర్పుయిచ్చే అవకాశం వున్నది. ప్రజాభిప్రాయాన్ని తమ భావాలకు అనువుగా మార్చుకునే స్వేచ్ఛ ప్రతిపక్షాలకు వున్నది. కాని తమ యిష్టంవచ్చిన ప్రభుత్వాన్ని అధికారంలోకి తెచ్చుకునే కృషిలో ప్రజలు ప్రజాస్వామిక విధానాలు మాత్రమే అనుసరించేటట్లు చేయడం చాలాఅవసరం. అన్ని పార్టీలు సామాన్య ప్రజల శ్రేయస్సుకే పాటుపడడానికి అంకితమైనాయి గనుక ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శ్రేయస్సునే అభిలషిస్తున్నవి గనుక వీటన్నిటి లక్ష్యమూ ఒకటేగనుక ఒక సాధారణ ఎన్నికలకూ మరొక సాధారణ ఎన్నికలకూ మధ్యవుండే కాలంలో ప్రగతి గమనాన్ని ఆటంకపరచే చర్యలు ఏవీ తీసుకోకుండా వుండడమే విజ్ఞత అనిపించుకుంటుంది. ఈనాడు 24వ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు అందజేస్తున్నాను.



# హైదరాబాదులో గాంధీజీ

గాంధీజీ తొలిసారిగా 1919 ఏప్రిల్ 7వ తేదీన హైదరాబాదు వచ్చి డా॥ యం. జి నాయుడు (శ్రీమతి సరోజిని నాయుడు భర్త) నివాసగృహమైన "గోల్డెన్ త్రెషహోల్డ్"ను సందర్శించారు. అక్కడ ఆయనను శ్రీ వామన్‌నాయక్, శ్రీమతి నాయుడు సోదరుడు భూపేంద్రనాథ్ ఛటోపాధ్యాయ కలుసుకొన్నారు. గాంధీజీ సికింద్రాబాదు రైల్వే స్టేషన్‌లో దిగినారు. సర్ అక్బర్ హైదరీ గాంధీజీకి నగరమంతా చూపించారు. వీరిద్దరికీ ఇదివరకే పరిచయంవుంది.

గాంధీజీ హైదరీల మధ్యవున్న స్నేహం చాల ముఖ్యమైనది. ఎందుకంటే దీన్నిబట్టి-జాతిపిత గాంధీజీ, నిజాం హైదరాబాదు నిర్మాత హైదరీల రాజకీయ సంబంధాలు కొంతవరకు తెలుస్తాయి. 1939 మార్చి 30న గాంధీజీ హైదరీకి ఇలా వ్రాశారు. "మీరు ఎన్నో ఘనకార్యాలు సాధించగలరని ఆశిస్తున్నాను. 1931 డిశంబరులో నౌకలో స్వదేశానికి తిరిగి వస్తున్నప్పుడు మనం జరిపిన సంభాషణలు నేను మరువజాలను. రెండు కులాల మధ్య శాంతిని నెలకొల్పడానికి సమిష్టిగా కృషి చేయవలసి వుంది. అయితే భగవదేచ్ఛ మరొక విధంగా వుంది. నేను జైలుకు వెళ్లవలసి వచ్చింది. మనం కలిసి పని చేయలేకపోయినా ఆ కోరిక ఇంకా నన్ను వెన్నాడుతూనే వుంది. మీకు కూడా ఇదే భావనవుందని భావిస్తున్నాను. ఈ కోరికను తీర్చడానికి మీకు ఎన్నో అవకాశాలున్నాయి. నాకు అట్టి అవకాశాలులేవు. నేను శ్రద్ధతో మిమ్మల్ని గమనిస్తున్నాను."

గాంధీజీ అదే రోజు బొంబాయి వెళ్ళారు. డా. నాయుడు, ఆయన కుమార్తె కుమారి పద్మజనాయుడు ఆయనకు వీడ్కోలిచ్చారు. ఈ నగరానికి గాంధీజీ కడసారి 1934 మార్చి 9న వచ్చారు. గాంధీజీ పర్యటన, ఇతర కార్యక్రమాలను ఆయనకు అనుకూలంగా వుండునట్లు ఎన్నోసారులు మార్పు చేయవలసి వచ్చింది.

హైదరాబాదులో నగర పోలీసు కమీషనరు కీ. శే. రాజా బహద్దూరు వెంకటరామారెడ్డి, గాంధీజీ రాకను గురించి మ. ఘ. వ. నిజాం ప్రభుత్వానికి నివేదిక సమర్పించారు. గాంధీజీ 1934 ఫిబ్రవరి 18న ఉదయం 8 గం. లకు రైలులో బళ్ళారి, బీజాపూర్ల మీదుగా హైదరాబాదుకు వచ్చారు. హోంమంత్రి లెఫ్టినెంట్ కల్నల్ ట్రెంచ్, రైల్వే స్టేషను నుంచి గాంధీజీకి ఊరేగింపు ఏర్పాటు చేయరాదని, ఆయన ఎక్కడ కూడా ఖాదీ భండారం



తెరువరాదని ప్రభుత్వానికి సలహా ఇచ్చాడు. హరిజనోద్ధరణ విషయంలో గాంధీజీ ఇచ్చే ఉపన్యాసాలలో రాజకీయ ప్రసక్తి కాని, ఆయనకు సమర్పించే సన్మానాలలో ఈ ప్రస్తావన కాని వుండరాదని చెప్పాడు. గాంధీజీ ప్రసంగాలు, ఆయనకు సమర్పించే సన్మాన పత్రాలు ప్రభుత్వానికి కనీసం ఒక వారం రోజులు ముందుగా అందజేయాలని కూడా ఆయన చెప్పాడు. అయితే గాంధీజీకి వివేక వర్ధినీ మైదానంలో ఆంగ్లంలో సమర్పించిన సన్మాన పత్రం ఇక్కడ పేర్కొనబడుతున్నది. 1930లో ఆయనపట్ల హైదరాబాదు రాష్ట్ర ప్రజలకు గల ఆదరాభిమానాలు ఏలాంటివో ఈ సన్మానపత్రంవల్ల మనకు తెలుస్తుంది.

"మహాత్మాజీ,"

మీ రాకవల్ల ఈ రోజు భాగ్యనగరం పవిత్రమైంది. హైదరాబాదు ప్రజల తరపున మీకు మేము సుస్వాగతం తెలుపుతున్నాము. మరి కొంతకాలం మీరు మా సమక్షంలో వుండినట్లయితే మేము కృతార్థులమై వుండేవారము. ఇక్కడి ప్రజలకు మీ ఆదర్శ జీవితాన్ని పరిశీలించే భాగ్యం కలిగి వుండేది. పీడిత ప్రజల ఉద్ధరణకు, సత్య ప్రేమలకు అలవాలమైన మిమ్మల్ని సన్నిహితంగా చూచే భాగ్యం కలిగివుండేది. అయినప్పటికీ గంగాజలంతో సమానమైన నిర్మలత్వంగల మీ వంటి మహా పురుషుల సందర్శన భాగ్యం కలిగినందుకు మా కందరికి చాల ఆనందం కలిగింది. సాధువును సందర్శించినంత మాత్రముననే, యాత్రా ఫలం అందినట్లవుతుంది కదా.

మహాత్మాజీ,

పీడిత ప్రజలను ఉద్ధరించడానికి మీరు గత మూడు దశాబ్దాలుగా నిరంతర కృషి చేస్తున్నారు. మీ యొక్క నిరాడంబర జీవితంతోను, బోధనా శక్తితోను సంఘంలో అలముకొనివున్న దురాచారాలు క్రమేణా అంతరించి పోతున్నాయి. కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకు వ్యాపించివున్న అస్పృశ్యత అనే కారు మేఘాలు ఋషితుల్యమైన మీ సలహావల్ల విడివడిపోతున్నాయి. త్వరలో మీ కార్యదీక్షవల్ల కష్టాలన్నీ తొలగిపోగలవని ఆశిస్తున్నాము. మీ సందేశం ప్రపంచం నలుమూలలకూ వ్యాపించింది. దీర్ఘ నిద్ర నుంచి సంఘం మేల్కొనింది. ఉజ్వల భవిష్యత్తుకై ఎదురుచూస్తున్నది.

పక్షం రోజుల క్రిందటనే హైదరాబాదు శ్రీరామనవమి ఉత్సవం జరుపుకొంది. హిందూ సంఘంలో వ్యత్యాసాలు అనే రాక్షసిని రూపుమాపడానికి మీరు అవతరించిన అపర రాములుగా ప్రజలు మిమ్మల్ని భావిస్తున్నారు.

శ్రీరాముని పాద ధూళి సోకినంతమాత్రాన శిలగా వుండిన అహల్య పునర్జన్మ ఎత్తినట్లుగా ఇక్కడికి మీ రాకవల్ల భాగ్యనగర ప్రజలు చైతన్యవంతులైనారు. భగవంతుడు మీకు ఆయురారోగ్యములు ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాము."

గాంధీజీ, విరాళమిచ్చిన దాతలను అభినందిస్తూ హిందూ మతానికి మచ్చగావున్న అస్పృశ్యతను తొలగించవలసిన ఆవసరాన్ని గురించి ప్రసంగించారు. మానవులందరూ సమానులు. అందరూ భగవంతుని బిడ్డలే. వివిధ కులమతములన్నీ ఒక చెట్టుకు చెందిన కొమ్మలు. పరిశుభ్రతను అలవరచుకోవాలనీ, మద్య మాంసాదులను విసర్జించాలని ఆయన హరిజనులను ఉద్బోధించారు.

హైదరాబాదుకు రావడంవల్ల, హరిజనోద్ధరణకై చేసే పర్యటనలు ముగిసినట్టేనని ప్రబలిన వార్తలను గాంధీజీ ఖండించారు. బీహారులో భూకంపంవల్ల, తన కార్యక్రమాన్ని తాత్కాలికంగా మాత్రమే నిలిపివేశానని ఆయన చెప్పారు.

దక్షిణ భారత దేశ పర్యటన ఫలితాలను గురించి చెప్పవలసిందని అడుగగా ఇది చాల విజయవంతమైనదని గాంధీజీ అన్నారు. అస్పృశ్యతా నివారణపట్ల ఉత్తర హిందూ దేశస్థులు ఎంత కృషి చేస్తున్నారో, దక్షిణ హిందూదేశ ప్రజలు కూడా అంతపాటు పడుతున్నారని ఆయన చెప్పారు. ఈ విషయంలో దక్షిణ భారత దేశీయులు ఎవ్వరికీ తీసిపోరని ఆయన చెప్పారు.

గాంధీజీ పాట్నా వెళ్లడానికి ముందు శ్రీమతి సరోజిని నాయుడు నివాస గృహ ఆవరణలో ఒక మామిడి మొక్కను నాటారు. ఎర్రవాడ జైలులోవున్న మామిడిచెట్టు మొక్క ఇది. ఈ చెట్టు క్రిందనే 1932లో గాంధీజీ తన చరిత్రాత్మకమైన ఉపవాస దీక్షను విరమించుకొన్నారు.

---





## విజయానికి దగ్గర మార్గం లేదు

విజయ సాధనకు హింసాయుతమైన దగ్గర మార్గాలమీద నాకు విశ్వాసం లేదు. మహోన్నతమైన లక్ష్యాలపై నాకు ఎంతటి గౌరవం, సానుభూతి ఉన్నప్పటికీ, వాటి సాధనకు హింసా విధానాలను అనుసరించడానికి మాత్రం నేను ఎట్టి పరిస్థితులలోను అంగీకరించజాలను. దానికి నేను పూర్తిగా వ్యతిరేకిని. హింసా తత్వానికీ నాకూ ఎప్పుడూ పొసగదు. అయితే నా అహింసా తత్వంయొక్క పరమార్థం యితరులతో వేరుపడి ఉండడం కాదు. దౌర్జన్యవాదులతోనూ అరాజక వాదులతోనూకూడా నేను సంబంధాలు పెట్టుకుంటాను. అయితే వారిని ఆ తప్పుడు మార్గం నుండి మరలించే ఉద్దేశంతోనే వారితో నేను సంబంధం కలిగివుంటాను. అసత్యం, హింసా మార్గాలద్వారా శాశ్వతమైన మంచి ఎన్నటికీ ఒనగూడదని అనుభవం రూఢి పరిచింది.

-గాంధీజీ







## ప్రజాస్వామ్య సోషలిజం ద్వారా

**ప్రజాస్వామ్య సోషలిస్టు మార్గం**
**ఆర్థిక వ్యత్యాసాలు తొలగించుకుంటూ**

1970, ఆగస్టు 15వ తేదీన పెరేడ్ ప్రసంగంలో












## నవ సమాజ నిర్మాణం

**అనుసరిస్తూ, మనిషికీ మనిషికీ మధ్య కొత్తసమాజం నిర్మించుకుందాం.**

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి





# మత తత్త్వ నిర్మూలన



—సి వి హెచ్. రావు

స్వాతంత్ర్యం వచ్చి ఇరవై మూడు యేండ్లు అయినప్పటికీ మన దేశంలో మతకలహాలు పెద్ద సమస్యగా పరిణమించాయి. ఇవి మన రాజ్యాంగపు ప్రజాస్వామ్య మతరహిత పునాదులను కదలించి వేస్తున్నవి. కేంద్ర దేశీయాంగ శాఖ మతకలహాల సంఘటనలను గురించి సేకరించిన వివరాలను చూచినటయితే ఇవి దేశ ప్రతిష్ఠకు ఎంత భంగకరంగా వున్నయో మనకు కనువిప్పు కాగలదు. 1968 సంవత్సరములో 346 పర్యాయాలు 1369లో 519 పర్యాయాలు మతకలహాలు జరిగాయి. గుజరాత్ లో ఇటీవల జరిగిన 153 సంఘటనలు కూడా ఇందులో చేరివున్నవి. ఇంతకంటే మహాధారుణమైన మతకలహాలు ఇటీవల మహారాష్ట్ర లోని జలాంధి, భివాండీలలో జరిగాయి. బీహారు, ఉత్తర ప్రదేశ్ మధ్యప్రదేశ్, కెరళ, గుజరాత్ రాష్ట్రాలలో ఇదివరకు ఎన్నో కలహాలు జరిగాయి. వీటిల్లో ధన మాన ప్రాణ నష్టం విపరీతంగా జరిగింది మతకలహాలను ప్రోత్సహించే వ్యక్తులు, సంఘాలను గురించి దేశీయాంగ శాఖ కొన్ని పరిశీలనలు జరిపింది. వివిధ కులాల వారికి ఎంతెంత నష్టం జరిగిందీ దేశీయాంగ శాఖ వివరాలు పేకరించింది. వీటివల్ల నేర్చుకోదగిన గుణపాఠాలు కొన్ని వున్నాయి. అయితే వీటినే ఆధరాగా అనుకొని రాజకీయ స్వప్రయోజనం కొరకు కొన్ని వర్గాలు, పార్టీలు మతకలహాలకు గల కారణాలను, బాధ్యతలను ఇతర పార్టీలకు, వర్గాలకు అంట గట్టడానికి ప్రచారం చేస్తున్నాయి.

కొన్ని రాష్ట్రాలలో వాతావరణం కలుషితమై మతంపేరుతో దౌర్జన్యకాండ జరుగుతున్నదనే విషయం సుస్పష్టం. చిన్న చిన్న విషయాలే పెరిగి పెద్దవై, భీషణ కలహాలకూ, రక్తపాతానికి దారి తీస్తున్నాయి.

మనదేశంలో మత కలహాలను గురించి అంతు లేకుండా చర్చలు జరుగుతున్నాయి. అయితే ఇప్పుడు కావలసింది చర్చలు కాదు మత కలహాలు మళ్ళీతలెత్తకుండా దృఢమైన చర్యలు తీసుకోవడం అత్యవసరం ఇంతవరకు మతకలహాలు జరిగిన తరువాత వాటిని అణచివేయడానికి గట్టి చర్యలేవీ తీసుకోవడం జరుగలేదు. అయితే ఇప్పుడు పరిస్థితిని క్షుణ్ణంగా పరిశీలించి వట్టి మాటలు కట్టిపెట్టి, గట్టి చర్యలు తీసుకోవడం చాల అవసరం. కేంద్ర విదేశాంగా శాఖ ఈ దృక్పథంతోనే కార్య రంగంలోకి

ఉపక్రమిస్తున్నది. మతసంబంధమైన పార్టీలను బహిష్కరించేందుకు కేంద్ర ప్రభుత్వం పరిశీలించాలి అయితే ఇందులో కొంత చిక్కువుంది. ఏది మత సంబంధమైన పార్టీ అని నిర్వచించడం కష్టం. ఇందులో రాజ్యాంగరీత్యా రాజకీయ రీత్యా కూడా చిక్కులున్నాయి.

అయితే మతసంబంధమైన పార్టీలన్నీ రద్దు చేసినట్లయితే, మరొక పేరుతో అవి తిరిగి తలెత్త వచ్చు. ఈ విధంగా క్రొత్త పేరులతో పుట్టిన పార్టీలను ప్రభుత్వం తిరిగి రద్దు చేయాలంటే అందుకు బలమైన కారణాలు చూపించ వలసివుంటుంది. ఇందులో మరొక ప్రమాదం ఇమిడివుంది ఒక పార్టీని బహిష్కరించినట్లయితే అది అజ్ఞాతవాసంలోకి పోవచ్చు. లేదా అధికారంలో వున్న పార్టీ యొక్క రాజకీయపు ఎత్తులకు ఈ పార్టీ బలి అయిపోయిందని ప్రజలు భావించి, దీని పట్ల ఆకస్మికంగా అభిమానాలు చూపవచ్చు. భారత ప్రభుత్వం కొన్ని మత సంబంధ పార్టీలను బహిష్కరించ వలసి వచ్చినప్పుడు, విదేశీయుల నామ స్మరణ చేస్తున్న అతి వాదులు తీవ్రవాదులైన నక్సలైట్ల వంటి గ్రూపుల విషయం కూడ జాగ్రత్తగా పరిశీలించవలసి వుంటుంది.

మత కలహాలు జరిగిన చోట్లలో, అక్కడ పోలీసు బందోబస్తు ఏర్పాట్లకు అయ్యే ఖర్చును ఆ ప్రాంతపు ప్రజలే భరించవలెనని దేశీయాంగ శాఖ చేసిన సూచన ఎంతో సమంజసంగా వుంది. అయితే ఇందులో కూడా కొంత లోపం లేకపోలేదు. ఏ పాపము ఎరుగని ప్రజలు కూడా, దోషులతో సమానంగా జరిమానా చెల్లించ వలసివుంటుంది. అంటే అది నిర్దోషులను శిక్షించినట్లవుతుంది. అయితే ప్రాంతం ప్రజలపైన సామూహికంగా జరిమాన విధించినపుడు ఈ నిర్ణయాన్ని నిర్మొహమాటంగా నిష్పాక్షికంగా అమలు పరచడం మంచిది. స్థానిక వత్తిడులకు లోను కారాదు.

ముఖ్య మంత్రుల సమావేశంలో ఒక విషయం తెలిసింది. మతకలహాలు జరిగే ప్రమాదం ఏర్పడనున్నది అనే విషయం, గూఢచారి శాఖకు ముందుగానే తెలియడంలేదు. ముఖ్యంగా మత సంబంధమైన పండుగలు ఊరేగింపులు జరిగే సందర్భంలో మత కలహాల సంఘటనలను ఈ శాఖ ముందుగా పసికట్ట లేకపోతున్నది. మామూలుగా ఇట్టి సందర్భాలలోనే మతకలహాలు ప్రజ్వరిల్లుతూ వుంటాయి. అందుకు తగినట్లుగా ముందుగానే బందోబస్తు చర్యలు తీసుకోవలసి వుంటుంది. ఏదో ఒక వర్గం ప్రజలు, ముందుగానే వ్యూహం పన్ని మతకలహాలను రెకెత్తిస్తున్నారని ఇటీవల జరిగిన సంఘటనలను బట్టి తెలుస్తున్నది. ప్రభుత్వ పరిశీలనలు ఈ విషయాన్ని ధృవీకరించాయి. అహ్మదాబాదు, భివండీలలో కలహాలు ఈవిధంగానే జరిగాయి. కనుక ఇట్టి సంఘటనలను ముందుగానే పసికట్టి అందుకు తగిన జాగ్రత్త చర్యలు తీసుకొనడానికి వీలుగా రాష్ట్ర ప్రభుత్వాలు గూఢచారి శాఖలను పటిష్ఠంచేయడం చాల అవసరమని తోస్తున్నది.

ప్రజాస్వామ్య సిద్ధాంతానికి కట్టుబడిన రాజకీయ పార్టీలన్నీ జాతి భద్రతకు దేశ శాంతికీ భంగకరమయ్యే కార్యకలాపాలు కొనసాగించరాదు. జాతీయ విద్రోహక చర్యలను ప్రోత్సహించే ప్రకటనలు చేయరాదు. ఒక సంస్థపైన ఏదైనా చర్య తీసుకొంటే దానిని విభిన్న దృక్పథంగల రాజకీయ పార్టీ పైన చర్య తీసుకొన్నట్లుగా భావించరాదు. అయితే మన దేశంలో రాజకీయ పార్టీలకూ, మత రాజకీయాలు ప్రోత్సాహిస్తున్న సంస్థలకూ మధ్య గీత గీయడం చాల కష్టమైన పని.

దీర్ఘ కాలిక చర్యగా, దేశంలో అన్ని వర్గాలకు వర్తించే విధంగా ఒక విధమైన సివిల్‌కోడ్‌ను రూపొందించడం వాంఛనీయమూ, అవసరమూ కూడా, "సెక్యులరిజం" పేరును మాటి మాటికి ఉదహరిస్తున్నందువల్ల దాని ప్రాముఖ్యత సమసిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. సార్వజనీన సివిల్‌కోడ్‌ను బలపరుస్తూ కొంతమంది ముస్లింలే ముందుకు వస్తున్నారు.

దేశంలో నూటికి డెబ్భై మంది ప్రజలు నిరక్షరాస్యులై, పాత సాంప్రదాయాలకు మూఢ నమ్మకాలకు కట్టుబడివున్నపుడు, వాస్తవమైన సెక్యులరిజాన్ని సాధించడం చాల కష్టమైన పని. సెక్యులరిజంఅంటే మతంలేనిది అనే అర్థంకల్పించుకొంటున్నారు.

మత తత్వాన్ని అణగ ద్రొక్కడానికి జాతీయ సమైక్యతా మండలి చేసిన సూచనలు అంత సమర్థమైనవిగా ఆచరణలో రుజువు కాలేదు. కొన్ని రాజకీయ పార్టీలు ఈ మండలి నిర్మాణాన్ని విమర్శించాయి. జాతీయ సమైక్యతా మండలి కూడా తన బాధ్యతలను సక్రమంగా నిర్వహించిందని ఘంటా పథంగా చెప్పలేము. ఎప్పుడో క్లిష్ట పరిస్థితులు ఏర్పడినపుడు ఇవి హడావిడిగా సమావేశమైనంత మాత్రాన పరిస్థితి అదుపులోకి రాదు. అనేక రాష్ట్రాలలో ఈ మండలికి శాఖలు లేవు. అవి వున్నచోట, సమర్థవంతంగా పని చేయడంలేదు. రాష్ట్రాలలోని శాఖలు తరచుగా సమావేశమై, పరిస్థితులను కూలంకషంగా చర్చించి ఆచరణయోగ్యమైన ప్రయోజనకారియైన సూచనలు, సలహాలు చేస్తూ వుండడం మంచిది.

కేంద్ర దేశీయాంగశాఖ 1969–70 సం॥నికి తయారు చేసిన వార్షిక నివేదికలో మత కలహాలను అదుపులో పెట్టడానికి అనేక నిరోధక చర్యలు, శిక్షాత్మక చర్యలు పేర్కొనింది. వివిధ స్థాయిలలో పౌర సంఘాలు ఏర్పాటు చేయాలని ఒక సూచన చేయబడింది. రాజకీయ పార్టీలన్నీ కలిసి మత కలహాలను రూపుమాపడానికి సమిష్టిగా ఉద్యమం లేవదీయాలని మరొక సలహా ఇవ్వబడింది. ఈ సూచనలు ఆదర్శవంతమైనవిగానే వున్నాయి కానీ, ఆచరణలోకి రాలేదు.

## నిరంతరం నిఘా

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నిరంతరం నిఘా వుంచినట్లయితే ఇట్టి సంఘటనలు జరగడానికి ఆస్కారం వుండదు. మత కలహాలకు వ్యతిరేకంగాను మత సామరస్యానికి అనుకూలంగాను ప్రజాభిప్రాయాన్ని మార్చడంవల్ల ఎన్నో ప్రయోజనాలు కలుగుతాయి.

ఒక విషయం గుర్తుంచుకోవాలి. దేశ విభజనకు దారి తీసిన మత తత్వం, మన దేశంలో ఇంకా ప్రబలంగానే వుంది. హిందువులు ముస్లింలు, ఇతర కులాలవారు అందరూ పండుగలు,

పెండ్లిండ్లవంటి సందర్భాలలో సామూహికంగా పాల్గొంటూ వున్నట్లయితే అన్ని మతాల మధ్య స్నేహబంధాలు దృఢతరమవుతాయి. మత సామరస్యానికి, మత సమైక్యతకు ఇట్టి సాంఘిక కార్యకలాపాలు దోహదం కలిగిస్తాయి. అన్ని కులాల మధ్య పరస్పర సాంఘిక, సాంస్కృతిక సంబంధాలను ప్రోత్సాహించడానికి మత, సాంస్కృతిక, సాంఘిక సంస్థలు కృషి చేయాలి.

## పత్రికల బాధ్యత

మతతత్వాన్ని రూపుమాపే విషయంలో పత్రికా రచనలపట్ల, ముఖ్యంగా కొన్ని వర్గాల ప్రాంతీయభాషా పత్రికలపైన ఒక కన్ను వుంచడం శ్రేయస్కరం, లోగడ కొన్ని మత కలహాల ప్రేరణకు ఈ పత్రికల రచనలే కారణమైనాయి. మత తత్వంతో వున్న పత్రికలను అదుపులో పెట్టే విషయమై రాష్ట్ర ప్రభుత్వాలు తగిన చర్యలు తీసుకోలేదని చెప్పవచ్చు. ఇందుకొరకు క్రొత్తగా శాసనం తయారుచేయడం అవసరం లేదు. ఇదివరకు తయారైన చట్టాల ప్రకారం తగిన చర్య తీసుకోవడానికి అవకాశం వుంది. మత కలహాలను గోరంత కొండంతలుగా వ్రాయడం, మత కలహాలను గురించి వదంతులు వ్యాపింప చేయడం, మత విషయాలను గురించి ఉద్రేక పూరితమైన వ్రాతలు మున్నగు వాటిని ప్రచురించే పత్రికలపైన తగిన చర్యలు తీసుకోవడానికి ఇప్పుడు అమల్లోవున్న చట్టాలు చాలు.

మత సంబంధాల విషయమై పత్రికలకు ప్రెస్ కౌన్సిలు చేసిన కొన్ని సూచనలు సమగ్రమైనవి. ఇవి కొత్త సూచనలేవీ కావు. బాధ్యతాహితమైన పత్రికలు కొన్ని స్వయంగానే ఇట్టి సూచనలను పాటిస్తూ వస్తున్నాయి. పత్రికలన్నీకూడా ఈ సూచనలు పాటించేట్లు చేయడం అవసరం: ఇందుకు రాష్ట్రిలలో జర్నలిస్టులతోకూడిన ఒక యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. మత కలహాలకు సంబంధించిన కేసులను త్వరగా పరిష్కారం చేయవలసిన అవసరాన్ని కోర్టులు గుర్తించాలి.

ఇంకా స్థిరత్వంచేకూరని భారతీయ ప్రజాస్వామ్యంలో బహుముఖంగా ఎన్నో దురాగతాలను ఎదుర్కోవలసివుంది. మతతత్వం అనేది ఈ శతాబ్ది ప్రారంభంలో మనకు వారసత్వంగా లభించింది. ఇప్పటికీ ఇది తలెత్తుతూనే వుంది. దీన్ని రాజకీయ స్థాయిలో, పరిపాలనా స్థాయిలో, శాంతి భద్రతల స్థాయిలో ఎదుర్కోవాలి. సాంఘిక విద్యా స్థాయిలలో కూడా బహుముఖకృషి చేసి దాన్ని నామరూపాలు లేకుండా చేయాలి. అందుకు సెక్యులరిజాన్ని బహుళ ప్రచారంలోకి తీసుకొనిరావలసి వుంటుంది. ఈ సెక్యులరిజం పైననే మన రాజ్యాంగపు పునాదులు నిలచి వున్నాయి అధికవర్గ ప్రజలు, అల్ప సంఖ్యాకవర్గ ప్రజలు దేశంపట్ల పరస్పర బాధ్యతలు, విధులు గుర్తించి, తమ తమ హక్కులను కాపాడుకొంటూ వుండాలి.

భారత ప్రజలందరిలో సహనము సుహృద్భావంవున్నట్లయితే సెక్యులరిజాన్ని కాపాడి, మత తత్వాన్ని రూపుమాపవచ్చు. అందరూ ఒకరికొకరు పొరుగువారిగా, స్నేహితులుగా ప్రవర్తించవలసిన అవసరాన్ని గుర్తించాలి.

అన్ని రంగాలలో, అన్ని విధాలుగా మత తత్వం పైన యుద్ధం జరగాలి. ముఖ్యంగా ప్రజా సహకారంతో ప్రభుత్వం ఇందుకు పూనుకోవాలి. దురదృష్టవశాత్తూ కొన్ని రాజకీయ పక్షాలు, ఇట్టి పరిస్థితులలో రాజకీయాలను ప్రవేశపెడుతున్నాయి. అవి ఈ సమస్యను జాతీయ దృక్పథంతో చూడడం లేదు. మత తత్వ నిర్మూలనకు అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని మార్చడానికి బృహత్తరమైన ప్రయత్నం చేయడం అవసరం. ★

---

# రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్రప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు పంపించండి.

సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞానప్రదములైన రచనలు కూడా పంపవచ్చు. ప్రకటించిన రచనలకూ, ఫొటోలకూ పారితోషికం చెల్లించబడుతుంది.

పి. వామనరావు

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార, పౌరసంబంధ, యాత్రిక శాఖ, హైదరాబాదు.

# వందేమాతరం గీతావతరణ

ముదిగొండ వీరభద్రమూర్తి

(1880 ప్రాంతంలో కలకత్తా నగరంలో 'సంజీవని' అనే పేరుతో ఒక సమితి భారత స్వాతంత్ర్య సముపార్జన కోసం స్థాపింపబడింది. ఈ రహస్య విప్లవ సంస్థ వార్షికోత్సవము జరుగుతున్న సందర్భంగా ఆ నాడు జరిగిన సభలో బంకించంద్రుడు తన "వందేమాతరం" గీతాలాపనచేశాడు.)

సభ మొదలయ్యె నయ్యెడ విశాలము వేదిక చిత్ర మౌ కళా
విభవముతోడ నా సమితి పెద్ద యధిష్ఠిత డౌచు షాజహాన్
విభు షహసాను పీఠమును విస్మృతినుండి వెలార్చె తారకల్
సభమున మల్లికల్ పొదరుసంబలె దోచె జనమ్ము కొల్వనన్.

వినిపించె న్నవనమ్ము తొట్టతొలి ఋగ్వేదాంత సూక్తాంగిరో
ముని సమ్రాట్ కృత వర్ణనామధురసంబున్ గ్రోలి "బంకిం"రచిం
చిన ఝుంకారము గేయరూపమున "వందే మాతర"మ్మంచు జా
తిని జాతిన్ గదలించి నాడి యమృతోద్వేలర్ఝురీరూఢిగా.

పండువెన్నెల దుప్పటి నిండు కప్పి
కొన్న పున్నమ యా గీతి విన్నయంత
పులకరించె నిలువున నొక బుడుత "బిపిన
చంద్రపాల్" పరవశించిన చంద మెంత?

చల్లనైనది కవోష్ణంబౌచు నుడుకెత్తి
నది మలయజసమానమ్మె నయ్యె
నాకులు రాలి మోళ్ళైన చెట్లకు నవ్వు
డ పుడ కెందలిరాకు లందగించె
బీళ్ళను జేళ్ళ నె న్నేళ్ళొ నాగటి కఱ్ఱ
మోపకున్నను పైరు మొలకలెత్తె
గడ్డపాఱలు మోగి కఠిన మైన తడి లేని
చట్టు బండలయందు జలము లూరె

మూడు కాళ్ళ ముదుసలి పేడి పిఱికి
కత్తి యున్నట్లు చేయి పై కెత్తి యార్చె
ఝమ్మనంగ "వందే మాతరమ్మ" గీతి
మారుతమ్ము మోసుకపోయి మలయు మేర.

కత్తి నాలుక వానికి ఖండశర్క
రోప మోక్తియు బ్రతు కెల్ల రుస రుస లగు
వాని కాణిముత్యపునవ్వు దాన మొసగె
రమ్యరీతి "వందే మాతరమ్మ" గీతి.

నీరు నిండారు కాసారమ్మునందు నె
త్రిని కల్వ విరిసిన రాణ విరిసె
పరిణ యోత్సవమందు పారాణి పెట్టిన
కాళికాచరణమ్ము కరణి మెఱసె
నాగస్వరస్వాన భోగ నాగర్వ మౌ
కోడె త్రాచు పడగ వోలె నెఱసె
కైలాసగిరి తాండవాలోల చండీశ
కటక సజ్జము గజ్జ యటుల మొరసె

ప్రజమనసులో నొకానొక భావము భర
తస్థిరాచరసిత భల్లదావము శ్రుతి
రంధ్ర మందు వందేమాత రమ్మ టంచు
సుఖకృతి స్ఫీతి గీతి దూసుకొని పోవ.

కిలకిల నవ్వి కేకిసలు భారత భాగ్య
లక్ష్మి కొట్టినది కే లంద మొఱక
పసరు తీసెదను నీ బాహుషష్టి కోటి
ననుచు తిట్టినది రాజ్యాంగ లక్ష్మి
బాడబాంబుదము నీ పైని వర్షించును
త్వరపడకే యనె భారతాంబ
ఇది మొద్ద లెవరి జాగృతి వారు మెసలు డీ
మాట లే లని విధి పోటు దీర్చె

తవర బంకిము చంద్ర చటర్జి వ్రాసి
నట్టి గేయము పఠిత మైనట్టి వేళ
జాతి జీవితవాహిని సాగి యుత్త
రాశ క్రొత్త మలుపు పాఱునట్టి వేళ.

అది యొక బీజాక్షరసం
పద "వందే మాతరమ్మ" మంత్రము గేయ
మ్మదలించెను విదలించెను
వదలించెను నాటినుండి వందతనమ్మున్.

('భారత జాతీయ సభావతరణము" అనే అముద్రిత కావ్యం నుండి)

# దేశ ఆర్థిక పురోగతి – చిన్నతరహా పరిశ్రమలు

బులుసు రాధాకృష్ణమూర్తి

**దేశ ఆర్థిక పురోగతికి చిన్నతరహా పరిశ్రమలు నిర్వహించు పాత్ర అతి ముఖ్యమైనది. జాతీయాదాయపు పెరుగుదలకు, నిరుద్యోగ సమస్యా పరిష్కారమునకు, పారిశ్రామికాభ్యుదయమునకు ఈ పరిశ్రమలు ఎక్కువగా దోహదము చేయగలవు. మనదేశములో ఈ చిన్నతరహా పరిశ్రమలు సాధించిన అభివృద్ధి ఈ పరిశ్రమల శ్రేయస్సు కొరకై మన ప్రభుత్వము చేయుచున్న కృషి, ఈ పరిశ్రమ లెదుర్కొనే కొన్ని సమస్యలు మున్నగు విషయములు ముఖ్యమైనవి**

1965_66 సంవత్సరమున మన జాతీయాదాయములో పెద్ద పరిశ్రమలవలన సమకూరిన ఆదాయము 1207 కోట్ల రూపాయలు. కాగా, ఈ చిన్నతరహా పరిశ్రమలవలన వచ్చిన ఆదాయం 1349 కోట్ల రూపాయలు. ఉద్యోగములను సమకూర్చుటలో కూడా ఈ పరిశ్రమలు విజయమును సాధించినవి, మొత్తము 89 లక్షల పారిశ్రామిక పనివారలలోను, 57 లక్షల మందిని ఈ చిన్నతరహా పరిశ్రమలు నియమించినవి. ముందుగా, 'చిన్నతరహా పరిశ్రమ' నిర్వచనము తెలిసికొనుట అవసరము. కుటీర పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు, చేతి పరిశ్రమలు మున్నగునవి ఈ చిన్నతరహా పరిశ్రమల జమలో చేరవు. మన పరిపాలనా సంస్కరణల సంఘము చిన్నతరహా పరిశ్రమను నిర్వచిస్తూ "ఇది యాంత్రిక శక్తిచే నడుపబడు అధునాతన యంత్రాంగము నుపయోగించు పరిశ్రమ" అని పేర్కొన్నది.

ఈ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి కొరకై మన ప్రభుత్వము మొదటి పంచవర్ష ప్రణాళికా కాలమునుండి కృషి చేయుచున్నది. ఈ మొదటి ప్రణాళికలో చిన్న పరిశ్రమలను ప్రోత్సహించుటకు రెండు ముఖ్యమైన పనులను మన ప్రభుత్వము చేసినది. మొదటిది, ఆయా పరిశ్రమలలోని వివిధ సమస్యలను పరిశీలన చేసి పరిష్కార మార్గములను సూచించుటకు కొన్ని కేంద్ర సంస్థలను స్థాపించినది. రెండవది, కొన్ని రకాల వస్తువులను ప్రభుత్వం ఈ తరహా పారిశ్రామికుల వద్దనే కొనాలని నిర్ణయించినది. గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలకు ఈ విధముగా మొదటి ప్రణాళికలో 30 కోట్ల రూపాయలు, రెండవ ప్రణాళికలో 90 కోట్ల రూపాయలు, మూడవ ప్రణాళికలో 425 కోట్ల రూపాయలు కేటాయించారు. జాతీయాభివృద్ధి మండలి ఆమోదించిన, సవరించిన ముసాయిదాలో, ప్రభుత్వరంగమునకు 298.45 కోట్ల రూపాయలు ఈ గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలకై కేటాయింపబడినది

ఈ చిన్నతరహా పరిశ్రమలపై, మన పరిపాలనా సంస్కరణల సంఘము ఒక నివేదిక సమర్పించినది. ఈ నివేదికలో, చిన్నతరహా పరిశ్రమలు, అనేకమందికి ఉద్యోగములు సత్వరముగా కల్పించుటకును, కేవలము స్వల్పమైన పెట్టుబడితో కొన్ని రకముల వినియోగపు సరకుల గిరాకీలో ఎక్కువ భాగమును అదుకొనుటకును, ఆర్థికముగా తక్కువ స్థితిలోనున్న మానవునికి పనులను సమకూర్చుటలోను, స్థానిక సాంకేతిక నిపుణతను, స్తోమతను వీలైనంత ఎక్కువగా ఉపయోగించుటకును సహాయపడగలవు". అని పేర్కొన్నది.

కాని ఈ తరహా పరిశ్రమలు అభివృద్ధి చెందుటకు ఆటంకములు ఎక్కువ. కొన్ని కొన్ని చిన్నతరహా పరిశ్రమలు పెద్ద పరిశ్రమలకు అనుబంధములు. అందువలన వీటి అభివృద్ధి ఈ పెద్ద పరిశ్రమల స్వభావముపై ఆధారపడి వుంటుంది. పెద్ద పరిశ్రమల అభివృద్ధి కుంటుపడినచో, ఈ చిన్నతరహా పరిశ్రమలు నిరుపయోగముగా వుండిపోతాయి. ఉదాహరణకు మన ఆంధ్రప్రదేశ్‌లో రాయలసీమలో పెద్ద పరిశ్రమలు లేక పోవుట వలన చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి నిరుత్సాహ కరముగా నున్నది. రాయలసీమలో ఖనిజ సంపద సమృద్ధిగా వున్నది. ఈ ఖనిజములు, చమురు ప్రాతిపదికగా చిన్నతరహా పరిశ్రమలనేకము స్థాపించుటకు వీలు

న్నది. ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు రాయలసీమలో 3 కోట్ల రూపాయల ఖర్చుతో 100 పరిశ్రమలను స్థాపించుటకు ఒక పంచవర్ష ప్రణాళికను రూపొందించారు. ఈ ఖర్చులో మూడవ వంతు భారమును ఈ కార్పొరేషన్ వారు భరిస్తారు.

మరి కొన్ని రకపు చిన్నతరహా పరిశ్రమల వలన కుటీర పరిశ్రమలు దెబ్బతినగలవు. దీని వలన దేశములోని ఈ పరిశ్రమలపై ఆధారపడి యుండు కొన్ని లక్షల కుటుంబములు విచ్ఛిన్నమవగలవు. అందువలన ఈ చిన్నతరహా పరిశ్రమలు ఎక్కువగా స్థాపింపబడి, వీరందరకూ ఉపాధి కల్పించు వరకు పరిస్థితి మెరుగుపడదు.

## పెద్ద పరిశ్రమల పోటీ

మరి కొన్ని చిన్నతరహా పరిశ్రమలు, పెద్ద పరిశ్రమల పోటీకి ఒట్టు కొనవలయును. ఈ పెద్ద పరిశ్రమలు చిన్నతరహా పరిశ్రమలు ఉత్పత్తి చేయు వినియోగపు వస్తువులనే ఉత్పత్తి చేయును. ఈ ఆటంకము నెదుర్కొనుటకు కొన్ని కొన్ని పరిశ్రమలు ఈ చిన్న తరహా పరిశ్రమలకై ప్రత్యేకింపబడినవి. ఇంతే కాక అమ్మకపు ధరయందు 15 శాతము వేరే రిబేటునిచ్చు పద్ధతిని ఖచ్చితముగా నాచరించుటకు పూనుకున్నది.

ఈ చిన్న తరహా పరిశ్రమలను అభివృద్ధి పరచవలెనని, ఆతురతతో ప్రతి గ్రామములోను నెలకొల్పినచో ఆశాభంగము కలుగ కలదు. కేవలము గ్రామములను పారిశ్రామికము చేయవలయునని గాని,ఉద్యోగములు కల్పించవచ్చునని గాని, పెద్ద పరిశ్రమలకంటే చిన్నపరిశ్రమలు స్థాపించుట సులభమనిగాని ఈ పరిశ్రమలను స్థాపింప బూనుట అవివేకము. నిజానికి, ఈ నిరుద్యోగ సమస్య ఎక్కువగా పెద్ద పరిశ్రమల వలననే నివారణ కాగలదు. పెద్ద పరిశ్రమలు ఎక్కువగా అభివృద్ధి పొందుట వలన ఉద్యోగావకాశములు ఎక్కువగా కల్పింపబడుటమే కాక చిన్నతరహా పరిశ్రమలు కూడా అభివృద్ధి చెందగలవు.

ఈ చిన్నతరహా పరిశ్రమలకు మరొక పెద్ద ఆటంకము, సాంకేతిక నిపుణుల సలహాలను పొందుటకు సౌకర్యములు లేక పోవుట. క్రయ విక్రయాల విషయంలోను, పరిశ్రమ సంబంధమైన పరిశోధనలకు కూడా ఆధునిక సౌకర్యములు లేవు. మరొక ముఖ్యవిషయము. కొన్ని కొన్ని చిన్నతరహా పరిశ్రమలుత్పత్తి చేయు వస్తువులకు కొన్ని కొన్ని ప్రదేశములలో గిరాకీ వుండగలదు. ఈ విధముగా ఆ ప్రదేశము యొక్క అవసరములను బట్టి స్థాపించుటకు ఆయారాష్ట్ర ప్రభుత్వములు ప్రధానపాత్ర వహించవలసి వుంటుంది. మన ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు వివిధ రకములైన చిన్నతరహా పరిశ్రమలపై 200 నివేదికలను అందజేయవలయునని ఒక పథకమును రూపొందించారు. దీని కొరకై 5 లక్షల రూపాయలు కేటాయించి ఒక సాంకేతిక ఆర్థిక సంస్థను స్థాపించెదరు. ఈ విధముగానే మార్కెట్ పరిశోధనకు ఈ పరిశ్రమలుత్పత్తి చేయు వస్తువులకు దేశీయ, విదేశీయ మార్కెట్లలో గిరాకీ ఏర్పడుటకు సహాయము చేయుటకు 50 లక్షల రూపాయల కేటాయింపుతో ఒక పథకమును తయారు చేసినారు.

ప్రస్తుతము ఈ చిన్నతరహా పరిశ్రమల మంచి చెడ్డలను జూచుటకు అఖిలభారత చేతి పనివారల సంఘము, చేనేత సంఘము, చిన్నతరహా పరిశ్రమల సంఘము. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల సంఘము కలవు.

కాని ఈ సంఘములన్నిటి స్థానముననే విడిగా ఒక చిన్నతరహా పరిశ్రమల సంఘము, ఖాదీ గ్రామీణ పరిశ్రమల సంస్థ వాలును. రెండవ సంఘము కేవలము కుటీర గ్రామీణ పరిశ్రమల బాధ్యతను, మొదటి సంఘము చిన్నతరహా పరిశ్రమల బాధ్యతను ఒప్పగించుకొన్నచో వీటి అభివృద్ధి మరింత ప్రోత్సాహకరము కాగలదు. ఈ సలహా మన పరిపాలనా సంస్కరణల సంఘము సూచించినదే.

ఈ చిన్నతరహా పరిశ్రమలు సత్వరముగా స్థాపింపబడక పోవుటకు ముఖ్యకారణము, ఈ చిన్నతరహా పారిశ్రామికులు ఆర్థిక, సాంకేతిక, వ్యవహారిక విషయములకు పెక్కు సంఘములతో వ్యవహరించవలసి వస్తుంది. ఆ పరిశ్రమల బాధ్యతను పూర్తిగా రాష్ట్రప్రభుత్వముల కొప్పగించినచో పరిస్థితి మెరుగవగలదు. వివిధ రాష్ట్రప్రభుత్వములు చేయు కృషిని కేంద్రప్రభుత్వము సమన్వయింప వచ్చును.

ఈ విధముగానే మన పరిపాలనా సంస్కరణల సంఘము మరి కొన్ని సిఫార్సులను చేసినది. అరుదైన కొన్ని రకపు వస్తువులలో కొంత శాతమును చిన్నతరహా పరిశ్రమలకు ప్రత్యేకించవలయును. యశదము, రాగి, సీసము మున్నగు లోహములను, లోహపు మరియు ఖనిజపు కార్పొరేషన్ వారు వీరికి సరఫరా చేయుచునే యుండవలయుననియు ముడిసరుకుల కొరకు పెట్టుకున్న దరఖాస్తులను మూడు నెలల వ్యవధిలో తేల్చిచెప్పి వేయవలయుననియు సలహాల నిచ్చినది.

## ఋణ సహాయం

చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికొరకై జాతీయము చేయబడిన అనేక బ్యాంకులు ఋణరూపమున సహాయము చేయుచున్నవి. సుంకములను తగ్గించుట, ముడిసరుకులపై రిబేటు నిచ్చుట (కస్టమ్స్, ఎక్సైజు), క్రయ విక్రయాల విషయంలో చేయూత నిచ్చుట, అమ్మకపు ధరయందు ఇంకను ఎక్కువగా రిబేటునిచ్చుట నిపుణులైన వారి సలహాలను ఈ తరహా పారిశ్రామికులకు లభ్యమగునట్లు చూచుట మున్నగు పనులవలన ఈ పరిశ్రమలు సత్వర అభివృద్ధి పొంది, దేశ ఆర్థిక పురోగతికి దోహదము చేయగలవు. ఈ చిన్న తరహా పరిశ్రమలకు కావలసిన, చేయదగిన సహాయము అతి సులభముగ తక్షణమే లభ్యమగునట్లు ప్రభుత్వము కృషి చేయవలయును.



# అవనిగడ్డ పంచాయతీ సమితి

## పదేండ్ల ప్రగతి

గడచిన పది సంవత్సరాల కాలంలో కృష్ణా జిల్లా అవనిగడ్డ పంచాయతీ సమితి సాధించిన పురోభివృద్ధిని పరిశీలించినట్లయితే ఈ సమితి ప్రగతి మార్గంలో చక్కగా పయనిస్తున్నట్లు విదితమవుతుంది.

ఈ దశాబ్దిలో అవనిగడ్డ సమితి గ్రామీణ ప్రజల ఉత్తమ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని వ్యవసాయం, పశుపోషణ, ఆరోగ్యం, పరిశ్రమలు, సహకారం మొదలైన రంగాలలో ప్రజలకు మేలుకరమైన ఉత్తమ సేవలు, సదుపాయాలు కల్పించడం ద్వారా తన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడానికి కృషిచేసింది.

1969_70 సంవత్సరం నాటికి సమితిలో సాగుక్రిందవున్న భూమిలో 96 శాతం విస్తీర్ణంలో అధికదిగుబడినిచ్చే వరివంగడాలను సేద్యంచేశారు. సహకార ఉమ్మడి వ్యవసాయానికి సంబంధించిన దివిసీమ బృహత్ప్రణాళిక రాష్ట్రంలో అసమానమైనది. ఇది 400 సహకార సంస్థలతో నిర్వహించబడుతున్నది. 29,046 ఎకరాలమేరకు దీని పరిధి విస్తరించివున్నది. ఇది అదనంగా 13,000 టన్నుల ఆహార ధాన్యాన్ని వుత్పత్తిచేస్తుంది. తత్ఫలితంగా సుమారు రూ. 90 లక్షల ఆదాయం లభిస్తుంది. మంచి ప్రయోజనాలు చేకూరుస్తున్న మరో ప్రాజక్టు ఎదురుమొండి పంపింగ్ పథకం. 1967లో యిది పూర్తి చేయబడింది. 4,400 ఎకరాలకు యిది నీటి పారుదల చేస్తుంది. దీని అంచనా వ్యయం రూ. 18 లక్షలు. కృష్ణానది ఈ సమితిగుండా ప్రవహిస్తూ బంగాళాఖాతంలో కలవడం ఈ ప్రదేశానికి వరప్రసాదంవంటిది. ఎందుచేతనంటే చేపలవేటకు ఇది సహజసిద్ధమైన స్థావరంగావుంది. ఇక్కడ లభించిన చేపలను వాలరు లభించే దేశాలకు ఎగుమతి చేయడమే కాకుండా దేశంలోని యితర రాష్ట్రాలకు కూడా సరఫరాచేస్తున్నారు. చేపల పరిశ్రమలకు సంబంధించిన రేవు కొరకు స్థలాన్ని నిర్ణయించే నిమిత్తం ఇటీవల అమెరికాకు చెందిన నిపుణుల బృందం ఈ సమితిని సందర్శించింది. పౌష్టికాహార కార్యక్రమం ఈ సమితికి అప్పగించబడింది. 1969_70 సంవత్సరంలో జాలరులకు 6,000 పౌనుల నైలాన్ దారాన్ని పంపిణీచేశారు.

కోడూరు యువక మండలి సభ్యులు సహకార ఉమ్మడి సేద్యాన్ని నిర్వహించడంతోపాటుగా ఒక పఠనాలయాన్ని, ఒక బాలవాడీని కూడా నడుపుతున్నారు. ఇది గణనీయమైన విషయం. ఈ సమితిలోని సహకారపరపతి సంఘాలు తమ కార్యకలాపాలను నూటికి నూరువంతుల మేరకు విస్తృతీకరింపజేయడం మరో గణనీయమైన అంశం. ఆరోగ్య, వైద్యరంగాలలో కూడా సమితి మంచి అభివృద్ధి సాధించింది. సమితిలోని జనాభా (1,35,500 మంది) అంతటికీ వైద్య సౌకర్యాలు అందజేశారు. కుటుంబ నియంత్రణ రంగంలో సైతం ఈ సమితి చాలా ప్రగతి సాధించింది. 1969_70 సంవత్సరంలో 665 ట్యూబెక్టమీ శస్త్రచికిత్సలు 225 వేసెక్టమీ శస్త్రచికిత్సలు జరిపారు. 1969_70లో తుఫాను,వరదలు మొదలైన ప్రకృతి దుర్ఘటనలు సంభవించినప్పటికీ ఈ యేడాదిలో జాతీయపొదుపు పథకానికీ, సి.టి.డి. అకౌంట్లకూ రూ. 1,81,555 లమొత్తం లభించింది.

కృష్ణానది మీద నిర్మించిన అక్విడక్టు, చల్లపల్లి రాజా కోట వంటి దర్శనీయ స్థలాలు, హంసలదీవి, మోపిదేవి, విశ్వనాధపల్లి వంటి యాత్రాస్థలాలు, కృష్ణానది బంగాళాఖాతంలో కలిసేచోట నిర్మించిన అపూర్వమైన అడ్డుకట్ట ఈ సమితిలో వున్నాయి.



# పంచాయతీ రాజ్యం ప్రజల రాజ్యం

# అద్దంకి బ్రాంచి కాలువ నుంచి నాగార్జునసాగర్ నీరు విడుదల



పెద్ద తరహా నీటి పారుదల శాఖా మంత్రి, శ్రీ ఎస్. సిద్దా రెడ్డి, 1970 ఆగస్టు 2 వ తేదీన అద్దంకి బ్రాంచి కాలువలోకి నీటి విడుదలకు ప్రారంభోత్సవం చేశారు.

కొత్తగా ఏర్పాటు చేయబడిన ఒంగోలు జిల్లా చరిత్రలో ఆగస్టు 2 వ తేదీ సువర్ణాక్షరాలతో లిఖించదగింది. జిల్లాలోని 53 గ్రామాల ప్రజలు ఆ రోజు తమ పొలాలలోకి కృష్ణా జలాలకు స్వాగతం పలికారు.

ఒంగోలు తాలుకాలోని 32 గ్రామాలు, అద్దంకి తాలుకాలోని 16 గ్రామాలు, చీరాల తాలుకాలోని 5 గ్రామాలలో అదనంగా 1.02 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం లభించింది. నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు చెందిన జవహర్, లాల్‌బహదుర్ కాలువలద్వారా యిప్పుడు 9,77 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం లభించింది.

## జవహర్ కాలువ

1967 ఆగస్టులో భారత ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధి, ప్రారంభోత్సవం చేసిన జవహర్ ప్రధాన కాలువ, నాగార్జున సాగర్ రిజర్వాయరునుండి ప్రారంభమై గుంటూరు, కర్నూలు, ఒంగోలు, నెల్లూరు జిల్లాలలో మొత్తం 20.58 లక్షల ఎకరాల ఆయకట్టుకు నీటిపారుదల సౌకర్యం కల్పిస్తుంది. ప్రస్తుతం కాలువ త్రవ్వకం దశలో మూసీ నదివరకు 40 బ్లాకులకుగాను మొదటి 22 బ్లాకులలో 11.74 లక్షలకు నీటి పారుదల సౌకర్యం కల్పిస్తున్నది.

## అద్దంకి బ్రాంచి కాలువ

జవహర్ కాలువ 91.7 కి. మీ. వద్దనుంచి అద్దంకి బ్రాంచి కాలువ బయలుదేరుతుంది. ఇక్కడ దీని నీటి వాహక శక్తి సెకనుకు 69.70 ఘ. మీటర్లు. దీనివల్ల గుంటూరు జిల్లాలోని నరసరావుపేటతాలూకా, వినుకొండ తాలుకాలోనూ, కొత్తగా ఏర్పాటైన ఒంగోలు జిల్లాలోని ఒంగోలు, అద్దంకి, చీరాల తాలూకాలలోనూ దగ్గర దగ్గర 2.44 లక్షల ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తుంది.

అద్దంకి బ్రాంచి కాలువ 332 మై. మొదలుకొని 373 మై. వరకుగల భాగంలో 55 అ. వెడల్పునూ, 7.5 అ. లోతునూ కలిగివున్న రెండు కాలువ లున్నాయి. ఇక్కడ నీటి గమనం సెకనుకు 2.5 అడుగులు. ఇవిగాక 35 అ. ల వెడల్పు, 10 అ. ల లోతుగల రెండు కాలువ లున్నాయి. వీటిలో 12,000 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది.

332 నుంచి 373 మై. వరకూగల కాలువ భాగంలో ప్రధాన తూములు, 1 సూపర్‌ప్యాసేజి, 1 బ్రిడ్జి, 1 రెగ్యులేటరు, ప్రధాన తూము కల ఒక వంతెన ఉన్నాయి. అద్దంకి బ్రాంచి కాలువ 373 మైళ్ళ వద్ద పైడిపాడు ప్రధాన బ్రాంచి కాలువ, ఎద్దనపూడి బ్రాంచి కాలువగా రెండుగా విడిపోయింది. పైడిపాడు బ్రాంచి కాలువ వల్ల ఒంగోలు తాలుకాలోని 24 గ్రామాలకుచెందిన 33,361 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం లభిస్తుంది.

## ఎద్దనపూడి బ్రాంచి కాలువ

అద్దంకి బ్రాంచి కాలువ 3733 మైలు తర్వాత ఎద్దనపూడి బ్రాంచి కాలువగా మారుతుంది. ఇది అక్కడనుంచి ఒక మైలు 1 ఫర్లాంగు దూరం ప్రవహిస్తుంది. ఇక్కడ 790 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది. ఇక్కడ దీని వెడల్పు 44 అ. లు. లోతు 6.4 అ. లు ఉంటుంది. ఈ బ్రాంచి కాలువ కోటపాడు మేజర్ అనీ, ఎద్దనపూడి మేజర్ అనీ రెండుగా చీలుతుంది. అది మళ్ళీ ద్రోణాదుల మైనర్, నూతలపాడు మైనర్‌గా చీలుతుంది. వీటివల్ల 69,186 ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తుంది. ఈ ప్రాంతంలో ఉపశాఖలు, చిన్న చిన్న కాలువలు—వీటి మొత్తం పొడవు సుమారుగా 227 మైళ్ళు ఉంటుంది.

బ్రాంచి కాలువతోసహా త్రవ్వకం పనులకు మొత్తం రు. 4.20 లక్షలు ఖర్చు అయ్యాయి. అంటే ఎకరాకు రూ. 172 ల చొప్పున ఖర్చు ఐంది.

నీటి పారుదల చట్టాన్ని అనుసరించి సాధారణంగా 100 ఎకరాలలోపు పంట కాలువలను రైతులే స్వయంగా త్రవ్వుకోవాల్సి ఉన్నప్పటికీ యీ పనిని పి. డబ్లు. డి. వారే నిర్వహించారు. అందువల్ల ఆయకట్టును త్వరితగతిని అభివృద్ధిపరచడానికి వీలు కలుగుతుంది. ఇంతవరకు లభింపజేసిన సేద్యపు నీటి సౌకర్యాన్ని సక్రమంగా వినియోగించుకోడానికి వీలుగా మార్కెటు, ఆయకట్టు రోడ్ల నిర్మాణానికి సమగ్రమైన పథకాన్ని రూపొందించారు. ఈ ఆయకట్టు రోడ్లను ఎక్కువ నీటి పంపిణీ కేంద్రాల మార్గంగా నిర్మించడం జరుగుతుంది.

*



జులై 17 వ తేదీన బీదర్ వెళుతూ మార్గ మధ్యంలో ప్రధాన మంత్రి హైదరాబాదులో కొద్ది సేపు ఆగారు. గవర్నరు, ముఖ్యమంత్రి ప్రభృతులు ఆమెకు స్వాగతం యిచ్చారు.



తెలుగు అకాడమీవారు ప్రకటించిన ఇంటర్‌మీడియేట్ రెండవ సంవత్సరం (తెలుగు మీడియం) కోర్సు పాఠ్య గ్రంథాల సెట్టును కేంద్ర విద్యామంత్రి శ్రీ వి. కె. ఆర్. వి. రావు జులై 16 వ తేదీన జూబ్లీ హాలు సమావేశంలో విడుదల చేశారు.

# వార్తా చిత్రాలు



జులై 14 వ తేదీన జూబ్లీ హాల్లో యునెస్కో‌తో సహకరించడానికి ఏర్పడిన భారత జాతీయ కమిషన్‌కు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ హైదరాబాద్‌లో జులై 30 వ తేదీన అంతర్జాతీయ విద్యా సంవత్సరం (ఆంధ్ర ప్రదేశ్) 1970 ఉత్సవాలకు ప్రారంభోత్సవం చేశారు. విద్యా శాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షత వహించారు.

వాస్తవానికి, శాసన రూపకల్పన సులభమైన పనికాదు. అది ఇతరుల భావాలను, సంక్షిప్తంగా కచ్చితమైన మాటలలో అభివ్యక్తం చేసే ఒక కళ. ఒక వ్యక్తి, తన స్వంత భావాలను సయితం, స్పష్టంగాను అసందిగ్ధంగాను, వెలిబుచ్చడం అంత తేలికైన పనికాదు. అలాంటప్పుడు, మరొకరి భావాలను వ్యక్తం చేయడం కష్టమైన పనేగదా ! వ్యక్తం చేయవలసిన విషయాలన్ని తెలుసుకోకుండానే, శాసనాన్ని రూపొందించవలసివస్తే, అది ఎంత కష్టమో ఆలోచించండి. రాజ్యాంగ సూత్రాలను, భారతీయ చట్టాలను, వాటికి సంబంధించిన న్యాయస్థానాల తీర్పులను, అవగాహన చేసుకొని, ప్రత్యేక శిక్షణపొంది, తగు అనుభవం గడించిన తరువాతనే, బిల్లుల యొక్క ముసాయిదా తయారు చేయుటకు అర్హత లభిస్తుంది. అయితే సమర్థుడైన, Draftsman లేక ముసాయిదాదారుకు కూడ నిర్దుష్టమైన ముసాయిదా రచన సాధ్యం కాకపోవచ్చు. ఆచరణలో, నిర్దుష్టమైన న్యాయం మాదిరిగానే, నిర్దుష్టమైన ముసాయిదా రచన, ఆదర్శంగానే ఉండిపోతుంది. ముసాయిదాదారు, సందేహములు, సంభావ్యమైన చిక్కులు, మొదలైన వాటిని ఆచరణయోగ్యమైనంత మేరకు, తగ్గించటానికి మాత్రమే ప్రయత్నిస్తాడు. Edmund Burke చెప్పినట్లు, శాసన నిర్మాణం యొక్క ఉద్దేశం, ప్రజాభిప్రాయాన్ని అనుసరించడం, సమాజం యొక్క భావాలకు రూపకల్పన చేసి, వాటికి నిర్దిష్టమైన ఆదేశబలం చేకూర్చడం మాత్రమేకాని, ఒక శాసనాన్ని ప్రజలపై బలవంతంగా రుద్దడంకాదు.

వలసి ఉంటుంది. శాసనాన్ని తొందరగా రూపొందించి, రానున్న శాసనమండలి సమావేశంలో ప్రవేశపెట్టాలనే దృక్పథముతో, ఒక్కొక్కప్పుడు పరిపాలనా శాఖ అధికారి, న్యాయశాఖ ముసాయిదాదారు దగ్గరకువెళ్ళి, ఆ ప్రతిపాదన పై ఒక బిల్లు తయారు చేయమని కోరుతారు. పరిపాలనా శాఖ అధికారులు, ఆ ప్రతిపాదన యొక్క ఉద్దేశాలను అర్థంచేసికొని, అవసరమైన పూర్తి వివరాలను ముందుగా సేకరించక పోవచ్చు. లిఖిత పూర్వకంగా అట్టి వివరాలు అందజేసే వ్యవధిగూడా ఒక్కొక్కప్పుడు ఉండదు. ముఖాముఖి చర్చలు మాత్రం జరుపుతారు. ఆ చర్చల ద్వారా, ముసాయిదా దారుకు కావలసిన పూర్తి వివరాలు లభించవు. మంత్రులందరు గూడ, తమతమ శాఖలకు సంబంధించిన బిల్లులను శాసన మండలిలో ప్రవేశపెట్టాలనే ఆతురతతో ఉంటారు, బిల్లుయొక్క ముసాయిదాను రూపొందించడానికి, ముసాయిదాదారుకు చాలినంత వ్యవధి ఉండదు. అయినా ముసాయిదాదారు తనకు లభించిన వివరాలను సాధ్యమైనంతవరకు అవగాహనచేసికొని, మిగతా వివరాలు ఊహించుకొని, బిల్లు తయారుచేయవలసి వస్తుంది. ఆ పిమ్మట ఆ బిల్లు శాసనమండలిలో ప్రవేశపెట్టబడుతుంది. శాసనమండలిలో ప్రవేశపెట్టబడ్డ బిల్లుల విషయంలో ప్రజాభిప్రాయం సేకరించటానికి, లేదా శాసనమండలి యొక్క ప్రత్యేక నియామక కమిటీల పరిశీలనకు పంపటానికి, అవకాశం ఉన్నప్పటికీ, అలా చేయటానికి ఒక్కొక్కప్పుడు వ్యవధి ఉండదు. బిల్లు ప్రవేశపెట్టబడిన రూపంలోనే, కొద్ది మార్పులతో

# శాసన రూపకల్పన-సాధక బాధకాలు

— జె.వీరాస్వామి

శాసనంగా రూపొందింపబడే బిల్లు ఎలా తయారు అవుతుందో పరిశీలిద్దాం.

ప్రభుత్వమువారు ప్రతిపాదించే బిల్లులన్నీ, న్యాయశాఖలో తయారు చేయబడుతాయి. ప్రయివేటు సభ్యుల బిల్లులు, వాటి ప్రతిపాదకులే తయారు చేస్తారు, బిల్లు, శాసన విధానమును, ముసాయిదా రూపములో వ్యక్తముచేస్తుంది. అందువల్ల ఒక బిల్లుయొక్క ముసాయిదా తయారుచేయుటకు పూర్వము, అమలు పరచుటకు ఉద్దేశించిన విధానములను, వాటి తాలూకు పూర్తి వివరాలు సేకరించాలి.

ఒక శాసనం చేయాలనే ప్రతిపాదన, మొట్టమొదట సచివాలయంలో సాధారణంగా ఆరంభమవుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ ప్రతిపాదన స్వయంగా మంత్రిగారే చేస్తారు. ఈ ప్రతిపాదన సచివాలయంలో దానికి సంబంధించిన పరిపాలనా శాఖలో పరిశీలింపబడుతుంది. ప్రతిపాదన విషయంలో, పూర్తి వివరాలు ఇస్తూ, అటువంటి ప్రతిపాదన రాజ్యాంగరీత్యా చేయడానికి వీలౌతుందో లేదో, న్యాయశాఖ అభిప్రాయము ముందుగా తీసికొన

శాసనంగా రూపొందుతూ ఉంటుంది. ప్రతి బిల్లు ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రచురింపబడుతుంది. Bar Associations వాటిని పరిశీలించి, వారి అమూల్యమైన అభిప్రాయాలను, ఆ బిల్లు శాసనంగా రూపొందకముందే, ప్రభుత్వ దృష్టికి తెస్తే, తగు సవరణలు చేయుటకు వీలవుతుంది.

పూర్వకాలంలో శాసన నిర్మాణం తక్కువగా ఉండేది. అప్పుడు బిల్లును ఆమోదించడానికి పూర్వం, దానిని క్షుణ్ణంగా పరిశీలించడానికి చాలినంత అవకాశం ఉండేది. కాని ఇప్పుడు అలా వీలు చిక్కడం లేదు. పరిపాలక యంత్రాంగములో ఉన్నవారికి ఏదైనా ఒక సమస్యను పరిష్కరించవలసివస్తే ఒక శాసనము కాని శాసన సవరణకాని. ఎందుకు చేయకూడదు అని ఆలోచిస్తూ ఉంటారు. Gibbon తన "Decline and fall of the Roman Empire" అనే గ్రంథంలో శాసన పద్ధతి పట్ల Locrians వైఖరిని వర్ణించారు. ఆ సమాజంలోని ఒకవ్యక్తి అమలులోనున్న శాసనానికి, సవరణ ఏదైన ప్రతిపాదింప దలచి నట్లయితే, అతడు తన మెడచుట్టు ఒక త్రాడు ముడి వేసికొని,

శాసనసభ ముందు నిలబడాలి. ఆ సవరణ త్రోసివేయబడితే, అతని మెడచుట్టు త్రాటిముడిని బిగించి, అతనిని చంపేవారట. అంటే ఆ కాలములో శాసనానికి సవరణ చేయటమంటే, అతి ప్రమాదమయిన పని అని తెలుస్తుంది.

ప్రభుత్వం నిర్వహించే సంక్షేమ కార్యక్రమాలు అంతకంతకు అధికమవుతున్న ఈ రోజుల్లో, శాసన నిర్మాణ కార్యక్రమం, శాసన సవరణ కార్యక్రమం ఎక్కువైనదంటే, ఆశ్చర్యమేమున్నది? పూర్వకాలంలో, ఇప్పుడున్నన్ని శాసనాల ఆవశ్యకత ఉండేదికాదు. ఇప్పటి సమాజం, కాలం గడిచినకొలది అధికతరమైన సమస్యలను ఎదుర్కొనవలసివస్తూ ఉంది. నేటి సమాజం అంతరిక్షాన్ని కూడ జయించాలనే లక్ష్యం పెట్టుకొన్నది. ఈ సమాజానికి, ఎక్కువ శాసనాల అవసరంలేదని ఎవ్వరనగలరు?

ఈనాడు, ముసాయిదాదారు స్వల్పవ్యవధిలో అత్యధిక విస్తృతిలో శాసనాల ముసాయిదాలు తయారు చేయవలసి వస్తూ వుంది. ఇదమిత్థంగా తెలియని వ్యక్తి యొక్క ఉద్దేశాన్ని ఆయన వ్యక్తపరచాలి. అంతేకాదు, ఆయన ఉద్దేశాన్ని, ఒక విజ్ఞునికి మాత్రమే అర్థమయ్యే స్పష్టమైన భాషలో, వ్యక్తంచేస్తే చాలదు. వక్రభాష్యం చేసేవ్యక్తి, అపార్థం చేసుకొనకుండునట్లు రచించాలి. Montescue ఇలా వ్రాశాడు: "అందరి మనస్సుల్లోను ఒకే భావమును కలిగించేటటువంటి, పదజాలమును మాత్రమే శాసనకర్తలు ఉపయోగించాలి." ఇది మానవ మేధస్సుకు సులభమైన పనికాదు. అన్నివిషయాలను, సమగ్రంగా అవగాహన చేసుకొని, తగు నిబంధనలను పొందుపరచడానికి, రాజ్యాంగ నిబంధనలను, వాటికి సంబంధంగా ఇచ్చిన తీర్పులను, దృష్టిలో పెట్టుకొని, శాసన ప్రతిపాదనలను పరిశీలించడానికి, ముసాయిదాదారుకు చాలినంత వ్యవధి ఇవ్వకపోవడమే అతని పొరపాట్లకు ముఖ్యకారణము. ముసాయిదా బిల్లును తయారుచేసిన తరువాత దానిని పరిశీలించడానికి ముసాయిదాదారుకు చాలినంత వ్యవధి ఉండాలి, సాధ్యమైనన్ని పర్యాయములు బిల్లును అధ్యయనం చేయాలి. అప్పుడు ఎన్నో పొరపాట్లు దృష్టికివస్తూ ఉంటాయి. ఒక్కొక్కప్పుడు, ఒకే శాసనానికి సంబంధించిన తీర్పులు ఒకదానికొకటి విరుద్ధంగా ఉండటం కూడ కద్దు. మన రాజ్యాంగంలో, కొన్ని ప్రాథమిక హక్కులు పొందుపరచబడి ఉన్నాయి. ఆ హక్కులకు భంగము కలిగించకుండ సమాజముయొక్క సంక్షేమమునకై శాసనాల ముసాయిదాను రూపొందించుట, అంత తేలికైన పనికాదు. కొన్ని సందర్భాలలో, క్లిష్టమైనట్టియు, అత్యవసరమైనట్టియు, పరిస్థితులను ఎదుర్కొనడానికిగాను, ప్రభుత్వం హడావుడిగా శాసన నిర్మాణానికి పూనుకొనవలసి వస్తుంది. అలా చేసిన శాసనాల్లో, ఏదైనా శాసనం చెల్లదని న్యాయస్థానం కొట్టివేసినచో, దానికి కారణం, ముసాయిదాదారుయొక్క అసమర్థతయేనని చెప్పడానికి వీలులేదు. "Ten Commandments" గురించి ఒక అమెరికన్ బాలిక ఇలా చెప్పిందట— "అవి అయోమయంగా ఉన్నాయి. ఎందుకంటే ఏమిచేయకూడదో చెపుతాయి కాని ఏమి చేయాలో చెప్పవు". మరి, కుప్పలు తెప్పలుగా వస్తున్న ఆధునిక శాసనాలను చూస్తే ఆమె ఏమి అని ఉండేదో?! శాసనాలు, అందరికి అర్థమయ్యేటట్లు రచించడం కష్టతరమైన పని. "Patents" కు సంబంధించిన శాసనం, అందరికి అర్థమయ్యేటట్లు రచించడం ఎలా సాధ్యమవుతుంది. ఇందుకు సంబంధించిన కథ ఒకటి ఉంది. అదేమంటే—

## న్యాయశాస్త్రి పరిభాష

"ఒక పేటెంటు కేసులో, న్యాయమూర్తికి ఒక ప్రామాణిక గ్రంథం ఉదాహరించబడింది. ఆ గ్రంథం, ఈ శాసన సంబంధమున పరిగణన పొందిన గ్రంథమేనా అని ఆ న్యాయమూర్తి అడిగారు. అవునని న్యాయవాది సమాధానం చెప్పాడు. అప్పుడు న్యాయమూర్తి—మీరు ఆ గ్రంథంలోనుండి చదివిన భాగము అర్థమయ్యేదిగా ఉన్నది. కావున అది పేటెంటు శాసనములో ఒక భాగమేనా అనే సందేహం కలుగుచున్నది.—అని అన్నారట. ముసాయిదాదారు, సాధక బాధకాలన్ని ఊహించి, వాటికి తగు నిబంధన చేయాలి. అతనికి 'దివ్యదృష్టి' ఉండాలి. ముసాయిదాదారు సాధక బాధకాలన్ని ముందుగా ఊహించక పోవడం వల్ల న్యాయస్థానాలు విపరీత వ్యాఖ్యానాలు చేసిన సందర్భాలు గూడా కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు:—జారత్వపు చట్టములో—ఒక 'స్త్రీ' అను పదము, 'వివాహిత స్త్రీ' కి కూడా వర్తిస్తుంది అని 'బండి లేక వాహనము' అను పదము, బైసికిలుకుకూడా వర్తిస్తుంది అని తీర్పు ఈయబడింది. తొందరపాటుగా ముసాయిదా తయారుచేయడంలోని, ప్రమాదాలను వేరే నొక్కిచెప్ప నవసరం లేదు. ఒక జంక్షన్‌వద్ద ఘోరమైన రైలు ప్రమాదం జరిగిన తరువాత, ఒకానొక రాష్ట్రము చేసిన శాసనమును గురించిన ప్రసిద్ధమైన ఉదాహరణ ఒకటి గలదు. అందులో, రెండు రైళ్ళు ఒకదానికొకటి ఎదురుగా వచ్చినపుడు, ప్రతి రైలు రెండో రైలు పోవువరకు, వేచిఉండాలని నిబంధన చేయబడింది, అంటే ఏ రైలు పోయే అవకాశం లేకుండా పోయింది. ఒకనాటి రాత్రి ఒక ముసాయిదాదారు ఇంటికి, స్నేహితుడు వచ్చి 'ఈ రోజు ఏదైన ప్రయోజనకరమైన పనిని పూర్తిచేశారా?' అని అడిగారు. ఆ ముసాయిదాదారు, "అయ్యా దాపరికం లేకుండా చెప్పాలంటే— ఈ రోజు ఉదయం ఒక మాటకు ముందు ఒక కామా గుర్తు పెట్టినాను. మధ్యాహ్నం, అది తీసివేసినాను. మీరు ఇప్పుడు నా గదిలోకి ప్రవేశిస్తూండగా, ఆ కామాను తిరిగి పెట్టాలని ఆలోచిస్తున్నాను. నేను ఈ రోజు చేసిన పని అంతా ఇంతే." అని సమాధానం చెప్పాడట. Macualay గొప్ప భాషావేత్త. అపారమైన జ్ఞాపకశక్తి కలవాడు. Paradise Lost అనే కావ్యాన్ని, క్రిందినుండి పైకి అప్పగిస్తూండేవాడు. అంతటివానికే "Indian Penal Code" ముసాయిదా రచించడానికి పది సంవత్సరాల కాలం పట్టిందట. ఈనాడు అతనికి సాటియైన ముసాయిదాదారులెవరు లేరు. వారికి ఇంకా ఎక్కువ సమయం, అవసరమవుతుందని వేరే చెప్పనక్కరలేదుగదా.

శాసన ముసాయిదా రచించే పని మెప్పుపొందేదికాదు. ముసాయిదాదారు రచించిన ఉత్తమ ముసాయిదాలను, మెచ్చుకొనేవారెవరూ ఉండరు. కాని, ముసాయిదాలల్లో తప్పులుంటే మాత్రం అంతా దూషిస్తారు. దానికి కారణం, బహుశః ఉత్తమ ముసాయిదా ఎప్పుడు న్యాయస్థానాల పరిశీలనకు రాకపోవడమే కావచ్చు. ముసా

(తరువాయి 24 వ పేజీలో)

# వెనుకబడిన తరగతుల విచారణ సంఘం సిఫార్సులు

ప్రభుత్వ మాజీ ప్రధాన కార్యదర్శి శ్రీ కె.యన్. అనంతరామన్ అధ్యక్షతన ఏర్పాటైన వెనుకబడ్డ తరగతుల విచారణసంఘం ప్రభుత్వానికి ఏకగ్రీవ నివేదిక సమర్పిస్తూ, వెనుకబడిన తరగతులవారికి వృత్తి కళాశాలలో 30 శాతం, ప్రభుత్వ సర్వీసులలో 30 శాతం సీట్లు కేటాయించాలని సిఫార్సు చేసింది.

సీట్ల రిజర్వేషను మొదట 10 సంవత్సరాలవరకు అమల్లో వుండాలనీ, ఆ తరువాత పరిస్థితిని పునః పరిశీలించి, అవసరమైతే ఈ రాయతీలను మరికొంత కాలం పొడిగించడానికి, ఈ కమీషను ప్రభుత్వానికి సూచించింది.

వెనుకబడిన తరగతులవారికి పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు, మునిసిపాలిటీలలోని పదవులకు రిజర్వేషను వుండాలనీ, ప్రభుత్వ సంస్థలలోకూడా వీరికి రిజర్వేషను వుండడానికి చర్యలు తీసుకోవాలనీ, ఈ కమీషను సిఫార్సు చేసింది.

వెనుకబడిన తరగతులవారికి విద్య, ఉద్యోగ విషయాలలో సమానావకాశాలు కల్పించే ఉద్దేశంతో ఈ తరగతులు 4 భాగాలుగా విభజింపబడినాయి. అవి :

1. ఆదిమజాతులు, విముక్తజాతులు, సంచారక జాతులు మున్నగువారు. — 7 శాతం
2. వృత్తివర్గాలు — 13 శాతం
3. ఇతర మతాలు పుచ్చుకొన్న హరిజనులు — 1 శాతం
4. ఇతర తరగతులు — 9 శాతం

సాంఘికంగా విద్యా విషయకంగా వెనుకబడివున్న వర్గ ప్రజలకు సౌకర్యాలు కల్పించే విషయమై ఆంధ్ర ప్రభుత్వం 1968 ఏప్రిల్ నెలలో ఒక విచారణ సంఘాన్ని నిర్ణయించిన విషయం పాఠకులకు తెలుసు. వెనుకబడిన తరగతుల జాబితాను తయారుచేసి వారి అభ్యున్నతికి విద్యా సంస్థలలో ఉద్యోగ నియామక విషయాలలో వారికి రిజర్వేషన్ ఏర్పాటుచేసే వుద్దేశంతో ప్రభుత్వం ఈ సంఘాన్ని నియమించింది. శ్రీ కె. యన్. అనంతరామన్ ఈ సంఘానికి అధ్యక్షులుగా నియమింపబడినారు. శాసన సభ్యులు శ్రీ టి. నాగేశ్వరరావు, శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు, శ్రీ ఐ. లింగయ్య, శ్రీ జి. నాగభూషణం, శ్రీ పి. లక్ష్మణరావుగారలు హైదరాబాదు కేంద్ర సహకార సంఘాల అధ్యక్షులు శ్రీ బి. శ్రీరాములు ప్రభుత్వ ఉపకార్యదర్శి శ్రీ యం. శ్రీరాములు ఇందులో సభ్యులుగా వున్నారు.

ఈ సంఘసభ్యులు రాష్ట్రంలోని 20 జిల్లాలలోను పర్యటించడమేకాక పొరుగు రాష్ట్రాలైన మద్రాసు, మైసూరు, కేరళ రాష్ట్రాలనుకూడా దర్శించి వివిధ వర్గాలకు సంబంధించిన అనేక భోగట్టాలను సేకరించారు. వీరు మొత్తం 820 మంది వ్యక్తులను కలుసుకొని వారివద్ద వాఙ్మూలాలు సేకరించారు. 480 మంది వ్యక్తులు వ్రాత పూర్వకమైన నివేదికలు సమర్పించారు. 175 మంది వ్యక్తులు, సంస్థలనుంచి ప్రశ్నలకు జవాబులు తెప్పించడం జరిగింది. రాజ్యాంగపు నిబంధనలను, హైకోర్టు, సుప్రీంకోర్టు అభిప్రాయాలను దృష్టిలో పెట్టుకొని, వెనుకబడిన ప్రజల జీవిత పరిస్థితుల విషయమై వ్యక్తిగతానుభవాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ సంఘం సాంఘికంగా ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారి జాబితాను తయారు చేసింది. ఈ జాబితాను తయారు చేయడానికి (1) పేదరికం, (2) వృత్తి, (3) విద్యా విషయకంగా వెనుకపడి వుండడం, (4) కులం విషయాలను పరిశీలించింది.

ఈ జాబితాలో 92 కులాలు వున్నాయి. వారిలో కొన్ని జాతులు, ఆదిమజాతులు, విముక్త జాతులు, సంచారక జాతులు కూడా చేరి వున్నాయి.

ఈ సంఘం చేసిన ఇతర ముఖ్య సూచనలు : సాంప్రదాయకమైన వృత్తులలో అధిక సంఖ్యలో ఉద్యోగవసతి కల్పించడానికి గృహపరిశ్రమలను పునరుద్ధరించడం. భూమి గరిష్ఠ పరిమితిని నిర్ణయించిన తరువాత మిగులు భూములను వెనుకబడిన తరగతుల వారికి పంచి పెట్టడం. లఘు పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు నెలకొల్పడానికి వెనుకబడిన తరగతులవారికొరకై ప్రత్యేకంగా ఫైనాన్సు కార్పొరేషను ఏర్పాటు చేయడం, భారీ ఎత్తున ఉద్యోగావకాశాలు కల్పించే వ్యవసాయ పరిశ్రమలు నెలకొల్పడం, పశుసంపద, పాడిపరిశ్రమలు, గొర్రెల పెంపకం, కోళ్ళ పరిశ్రమ, పందుల ఉత్పత్తి మత్స్య పరిశ్రమ చేనేత పరిశ్రమలను అభివృద్ధి పరచడానికి ప్రత్యేక చర్యలు తీసుకోవడం.

విద్యా విషయంలో ఈ సంఘంచేసిన సూచనలివి : ప్రభుత్వ పరీక్షలకొరకు విద్యార్థులకు ప్రత్యేక బోధనా సౌకర్యాలు కల్పించడం, హైస్కూలు దశవరకుగల అన్ని రకాల ఫీజుల చెల్లింపు నుంచి వీరిని మినహాయించడం, పుస్తకాలు కొనడానికి ఆర్థిక సహాయం చేయడం; గ్రామీణ ప్రాంతాలలో రెసిడెన్షియల్ సెకండరీ స్కూళ్ళను స్థాపించడం.

కుల తత్వంవల్ల ఏర్పడిన సాంఘిక దురలవాట్లను రూపుమాపడానికికూడా ఈ సంఘం కొన్ని సూచనలు చేసింది. గ్రామాలలో సంఘ సంస్కరణలు తీసుకొని రావడానికి అన్ని కులాల వారికి సమానంగా విందులు ఏర్పాటు చేయడం, మతాంతర వివా

హాలను ప్రోత్సహించడం అగ్ర కులాల వారు వెనుకబడిన కులం వారిని వివాహం చేసుకొన్నట్లయితే, వెనుకబడిన కులాలకు ఏర్పాటుచేసిన సౌకర్యాలను వారికి కూడా కల్పించడం మున్నగు చర్యలు తీసుకోవాలని ఈ సంఘం సూచించింది.

శాసన సభలు, జిల్లా పరిషత్తులు, సమితులు, మునిసిపాలిటీలలో వివిధ స్థాయిలలో వెనుకబడిన వారికి తగిన ప్రాతినిధ్యం వుండడానికి ఉత్తమ సాంప్రదాయాలు ఏర్పాటు చేసినట్లయితే, ఈ ప్రజలలో ఆత్మ విశ్వాసం ప్రబలుతుంది. తమ హక్కులు ప్రయోజనాలకు తగిన రక్షణ వుందనే భావం వారిలో ఏర్పడుతుంది. వెనుకబడిన తరగతుల యోగక్షేమాలను విచారించేందుకు ప్రత్యేకశాఖ వుండాలి. కేబినెట్ మంత్రి హోదాలో వెనుకబడిన తరగతులకు ప్రత్యేక మంత్రి వుండాలి.

ఈ తరగతుల స్థితి గతులను అభివృద్ధి పరచడానికి తగిన సూచనలు, సలహాలు ఇవ్వడానికి ప్రత్యేక సలహా సంఘం ఏర్పాటు చేయాలి.

స్కాలర్ షిప్పులు, హాస్టలు సౌకర్యాలు కల్పించే విషయములో, సాలీనా కుటుంబానికి రూ 6000 లకు మించిన ఆదాయం గల వారికి, మెట్రిక్యులేషను వరకు ఉచిత విద్యా సౌకర్యాలు వుండాలని సంఘం సూచించింది :—

వివరాలు ఇవి :—

హాస్టలులోవున్న విద్యార్థులకు పరుపులు మున్నగు సౌకర్యాలు వుండాలి.

జేబులోనుంచి ఫీజు ముందుగా చెల్లించాలని వెనుకబడిన తరగతుల విద్యార్థులను నిర్బంధం చేయరాదు. ప్రభుత్వం నుంచి వారికి డబ్బు అందేంతవరకు విద్యా సంస్థలు వేచివుండాలి. ఉన్నత విద్యాభ్యాసం కొనసాగించేందుకు ఈ విద్యార్థులకు స్కాలర్ షిప్పులు మంజూరీ చేయడానికి బడ్జెటులో తగిన నిధులు కేటాయించేట్లు చూడాలి. పరిపాలనా ఇబ్బందుల కారణాన ఈ కార్యక్రమం ఒకేసారి అమలు పరచడానికి సాధ్యం నట్లయితే, ప్రభుత్వం అంచెలవారీగా దీనిని అమలు పరచవచ్చు.

జనాభా, విద్య, ఉద్యోగ విషయమై ఈ సంఘానికి వివరాలు సరిగా అందలేదు. కనుక వర్గ, కుల, మత రహిత సమాజాన్ని ఏర్పాటు చేయాలంటే, వచ్చే జనాభా గణాంక వివరాల సేకరణ సందర్భంలో కులం వారీగా వివరాలు సేకరించాలి. అప్పుడు వీరు సాధించిన ప్రగతిని పరిశీలించడానికి వీలు కలుగుతుంది. ఈ విషయమై రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి రాయాలి.

| | తండ్రి ఆదాయం | క్లాసు—కోర్సు | నియామక స్వరూప స్వభావాలు |
|---|---|---|---|
| 1. | సాలీనా రూ. 3000కు లోపు | అన్ని దశలలో విద్య | స్కాలర్ షిప్పులు, ఫీజులు, హాస్టలు ఛార్జీలు, పుస్తకాల ఖర్చు. ఈ సదుపాయాలు ఇప్పుడు కల్పించబడుతున్నాము. |
| 2. | సాలీనా ఆదాయం రూ. 3600 పైన రూ. 4800లకు లోపు | మెట్రిక్యులేషన్ తరువాత అన్ని దశలలో విద్య | స్కాలర్ షిప్పులు మరియు ఫీజులు, హాస్టలు ఛార్జీలు, పుస్తకాలు ఖర్చు కలుపుకొని. |
| 3. | సాలీనా రూ. 4800లు రూ. 6000లు. | ,, | ట్యూషను ఫీజు మాత్రమే. |

ప్రస్తుతం జీవన వ్యయం ఎక్కువగా వున్న కారణాన, ప్రభుత్వ హాస్టళ్ళలో బోర్డింగు ఛార్జీలు పెంచాలి. ప్రయివేటు హాస్టలులో వున్న వారికి అనుగుణంగా సబ్సిడీ రేట్లను పెంచాలి.

వెనుకబడిన తరగతుల విద్యార్థుల అవసరాలకు తగినట్లుగా ఎక్కువ హాస్టళ్ళు తెరవాలి.

సాధ్యమైన చోట్లలో, స్కూలు భవనాలలో స్కూలు వేళల తరువాత ఈ విద్యార్థులు చదువుకొనేందుకు రాత్రిపూట నిద్ర పోవడానికి వీలు వుండాలి.

ప్రతి హాస్టలులో ప్రయివేటు తరగతులు నిర్వహించడానికి వృత్తి విషయంలో తగు సూచన నివ్వడానికి సౌకర్యాలు వుండాలి.

# వెనుకబడిన తరగతుల జాబితా

## 1 వ గ్రూపు

### ఆదిమజాతులు, విముక్త జాతులు, సంచారక జాతులు మున్నగువారు

1. అగ్నికుల క్షత్రియులు, పల్లి, వాడబలిజ, బెస్త, జాలరి, గంగావర, గంగపుత్ర, గూండ్ల, వన్యకుల క్షత్రియులు (వన్నెకాపు, వన్నెరెడ్డి, పల్లికాపు, పల్లిరెడ్డి) నెయ్యల పట్టపు.

పంబల, పెద్దమ్మవాండ్లు, దేవరవాండ్లు, యెల్లమ్మవాండ్లు ముత్యాలమ్మవాండ్లు, వీరముష్టి, వాల్మీకి, బోయ, (బోయ, కిరాతక, నిషాధ, ఎల్లపి, పెద్దబోయ) తలయారి, చుండువాళ్ళు

తెలంగాణా ప్రాంతంలో ఎరుకలు, గూడల, కంజరభట్ట. కింతల కళింగ, కెంపర లేక వెడ్డిక, మొండెపట్ట, నొక్కర, పరికి ముగ్గుల, యాత, చూపమారి, కైకడి, జోషి, నందివలస, ఎడ్డి (వడ్డి, వడ్డిలు)

## 2 వ గ్రూపు

## వృత్తి గ్రూపులు

అచ్చుకట్లవాండ్లు, ఆర్యక్షత్రియ, మూచి (తెలుగుమాట్లాడు వారు) చిట్టారి, గినియార, చిత్రకార, నఖాస, దేవాంగ, ఏడిగ గౌడ, గౌండ్ల, సెట్టిబలిజ—వీరు విశాఖపట్నం, ఉభయ గోదావరి, కృష్ణా జిల్లాలవారు, దూదేకుల లద్దఫ, పింజరి లేక నూర్బాష్, గాండ్ల, తెలికుల, జాండ్రి, కుమ్మర, కర్ణభక్తులు, కూరుమ, నాగవడ్డీలు, నీలకంటి, పట్కార (ఖతి) పెరిక, పెరికి బలిజ, పూరగిరి క్షత్రియ, నెస్సి లేక కుర్ని; పద్మసాలి (సాలి, సాలివన, పట్టుసాలి, సేనాపతులు, తొగటసాలి) శ్రీ శాయన (సెగిడి) స్వకులసాలి, తొగటి, తొగటి లేక తొగట వీరక్షత్రియ, విశ్వ బ్రాహ్మణ (అసుల, కంసాలి, కమ్మరి, కంచారి, వడ్ల, వడ్ర, వడ్రంగి, శిల్పులు.)

## 3 వ గ్రూపు

## ఇతర మతాలు పుచ్చుకొన్న హరిజనులు

క్రైస్తవమతం తీసుకొన్న షెడ్యూలు కులాలవారు.

## 4 వ గ్రూపు

## ఇతర తరగతులు

అగరు, ఆరెకటిక, కటిక, అగ్గర, భట్రాజు, చిప్పోలు, గవర, గౌడబ, హట్కర, జక్కుల, జింగార, కండ,) కోష్ఠి కాచి, కళావంతుల, గణిక, కృష్ణబలిజ (దాసరి, బుక్క) కొప్పులవెలను, మథుర, మాలి, ముదిరాజ, ముత్తరాసి, తెను గోళ్ళు, మున్నూరు కాపు (తెలంగాణా) నాగవాసం (నాగవంశం) నెల్లి, శ్రీకాకుళం, విశాఖపట్నం, జిల్లాలోని పొలినాటి వెలమలు, పూసల పస్సి, రంగ్రేజు లేక భావసార క్షత్రియ. సాధుచెట్టి, సాతాని (బెట్ట దాసరి వైష్ణవ), తమ్మల్లి శ్రీకాకుళం విశాఖపట్నం జిల్లాలోని తూరుపు కాపులు. (తూరుపు కాపుల తెగలో స్త్రీలు విడాకులు పుచ్చుకోవడం, పునర్వివాహాలు చేసుకొనే సాంఘిక ఆచారం వుంది) ఉప్పర లేక సగర వంజర (వంజరి) యాదవ (గొల్ల).



(21 వ పేజీనుండి)

## (శాసన రూపకల్పన : సాధకబాధకాలు)

యిదా దారు, దూషణ భూషణలకు అతీతుడై యుండాలి. అతడు ఎప్పుడు చికాకు చెందకూడదు. ఉద్రేకపడకూడదు. అతడు కలవరపడినచో, తన పనిని క్రమంగా నిర్వహించలేడు. అతని పనిలోని చిక్కులను, తెలియని వారెవరైనా అతనిని విమర్శించినచో అతడు దానిని పట్టించుకొనకూడదు. విమర్శించిన వారే గనుక తన పనిని చేసివుండినచో ఎంత ఘోరంచేసి వుండేవారో అని ఊరట చెందాలి. "Rent Control" చట్టముల క్రింద, ఒక కేసులో తీర్పు చెప్పుతూ, "ఆ చట్టముల ముసాయిదాదారు చేగాని వానిని ఆమోదించిన శాసనసభ్యుల చేగాని, ఖర్చులు చెల్లించబడాలని తాను తీర్పు చెప్పడానికి వీలులేనందుకు Lord Justice Scrutton విచారం వ్యక్త పరచారట. అయినా, ముసాయిదాదారు ఇబ్బందులను అవగాహన చేసికొనే న్యాయమూర్తులు కూడా లేక పోలేదు. Lord Denning ఇచ్చిన ఒక తీర్పును ఇందుకు మంచి ఉదాహరణగా చెప్ప వచ్చును. అందులో ఒక భాగం ఇలా ఉన్నది.

" గణితంలో మాదిరిగా, కచ్చితమైన లక్షణం ఆంగ్ల భాషలో లేదు. అలా వుండి యుంటే, నేడు మన సాహిత్యం ఇంత సుసంపన్నమై వుండేదికాదు. ఈ విషయాన్ని, గ్రహించక పోవడం వల్లనే, పార్లమెంటు చట్టాల ముసాయిదాదారులను అన్యాయంగా విమర్శించడం జరుగుచున్నది. ... ... పార్లమెంటుయొక్క చట్టాలు, దివ్యదృష్టితో అసందిగ్ధంగా, రచించబడినట్లయితే, న్యాయమూర్తులకు ఎంతో శ్రమ తప్పుతుంది. అలా జరుగని పక్షంలో, ఒక చట్టంలో ఏదైన లోపం కనిపించినప్పుడు, న్యాయమూర్తి చేతులు ముడుచుకొని ముసాయిదాదారును దూషిస్తూ కూర్చొనకూడదు. ఆయన పార్లమెంటుయొక్క ఉద్దేశం, ఏమై వున్నదో తెలుసుకొనడానికి, నిర్మాణాత్మకంగా ప్రయత్నించాలి. ఇందుకు ఆయన చట్టంలోని భాషను మాత్రమే పరిశీలించకూడదు. ఏ సాంఘిక పరిస్థితుల కారణంగా, ఏ లోపాన్ని సరిదిద్దడానికి ఆ చట్టం చేయబడిందో, అవగాహన చేసుకొని పార్లమెంటు యొక్క ఉద్దేశం నెరవేరే రీతిగా దానిని అన్వయం చేయాలి. ఆ చట్టమును చేసినవారే, ఆ దోషాన్ని గ్రహించివుంటే దానిని ఏ విధంగా సరి చేసి వుండేవారో, ఆయన గ్రహించి, తదనుగుణంగా వర్తింపచేయాలి. న్యాయమూర్తి చట్టంలోని నిబంధనలను మార్పు చేయకూడదు. కాని అందలి దోషాలను తొలగించవచ్చును. యథార్థానికి ఆయన ఆ విధంగా చట్టాన్ని దోష విముక్తం చేయడం ఎంతో అవసరం."

ఈ సాధక బాధకాలన్నీ విన్న తరువాత, మిమ్మలను ఎవరైనా శాసన ముసాయిదాదారు అవుతారా లేక మరొక ఉద్యోగం చేస్తారా, అని అడిగితే, ముసాయిదాదారు ఉద్యోగం చేస్తాను అని చెప్తారా?



## చిత్తూరు జిల్లాలో



# కొత్త పరిశ్రమల స్థాపనకు అవకాశాలు

### వ్యవసాయ పరికరాలు

చెరకు గడనుంచి రసంతీసే గానుగు, పుష్కల్టివేటర్ వెట్ లేండ్ పడ్లర్ వంటి వ్యవసాయ పరికరాల్ని ఈ జిల్లాలోని జనరల్ ఇంజినీరింగ్ పరికరాల్ని తయారు చేసే యూనిట్లే తయారు చేస్తున్నాయి. యీ యూనిట్లు, డీసిల్ ఆయిల్ ఇంజన్ల విభాగాలను కూడా తయారు చేస్తున్నాయి.

వ్యవసాయ పరికరాలకు యీ జిల్లాలో 1957-58లో రూ. 3లక్షల విలువ మేరకు గిరాకి వుంది.

ఈ జిల్లాకు కావలసిన వాటిలో 25% యీ జిల్లాలోని యూనిట్లే అందజేస్తున్నాయి.

సాగుప్రాంతం పెరుగుతున్నకొద్దీ వ్యవసాయ పరికరాల అవసరం కూడా పెరుగుతున్నది.

సెంట్రీఫ్యూగల్ పంపులను తయారుచేయడానికి కూడా యీనాడు అవకాశాలు బాగావున్నాయి.

### మోటారుకార్ల విడిభాగాలు

చిత్తూరు జిల్లాలో 1957-58 లో మోటారు కార్ల విడిభాగాలు సహాయక పరికరాలకు సుమారుగా 5 లక్షల రూపాయల విలువ మేరకు గిరాకి వుండింది.

ఈ జిల్లాలో యిప్పుడున్న అవసరాలలో 10 శాతం మేరకు మాత్రమే యిక్కడి యూనిట్లు తయారుచేసి అందచేస్తున్నాయి. మిగతావి బొంబాయి, కలకత్తా మద్రాసుల నుంచి దిగుమతి చేసుకోవడం జరుగుతున్నది.

ఈ జిల్లాలో ముందు ముందు రోడ్లు అభివృద్ధి చెందనున్న దృష్ట్యా యిక్కడ కార్ల వినియోగంకూడా పెరుగుతూ వుండంవల్ల మోటారు కార్ల విడిభాగాల గిరాకీ ఏ రోజు కారోజు ఎక్కువవుతున్నది.

ఇప్పుడువున్న యూనిట్లు తయారు చేస్తున్న కార్ జాక్, కింగ్ పిన్నులు, షటిల్ పిన్నులు, త్రెడ్ పిన్నులు, బుష్లు, స్ప్రింగ్ప్లేట్లు, స్ప్రింగ్ బ్రేకులు మొదలైన కార్ల విడిభాగాలుతో పాటు ఇంధనపు టేంకులు, మఫర్లు, యుక్లెంపులు, బ్రేక్‌డ్రములు వాటర్ పంపులు మొదలైన వాటిని కూడా కొత్తగా నెలకొల్పే యూనిట్లు తయారు చేయవచ్చు.

### ఇళ్ళలో వాడే పాత్రసామాను

పాత్రసామానుల్ని తయారు చేయడం యీ జిల్లాలో సాంప్రదాయక పరిశ్రమగా వుంటూ వస్తూంది.

ఈ ప్రాంతంలో నిపుణులైన పనివారు వున్నారు.

ఇప్పుడు ఏటా రూ 60 లక్షలు విలువచేసే పాత్ర సామాను యిక్కడ తయారవుతుంది.

వీటిని తయారు చేయడంలో అనుసరిస్తున్న ఆధునిక పద్ధతులవల్లా, ముడి పదార్థాలు తేలికగా లభించడంవల్లా ఈ పరిశ్రమకు ముందు ముందు మంచి భవిష్యత్తు వుంది.

లఘు పరిశ్రమలకు ముడిపదార్థాలను లభింపజేయడంలో రాష్ట్ర పరిశ్రమల శాఖ తోడ్పడుతుంది.

ఆధునిక కొలిమిలు, యంత్ర పరికరాలు, షీట్ మెటల్ వర్క్సుకు సంబంధించిన ప్రెస్ మిషన్లు మొదలైనవాటిని వాయిదాల పద్ధతిపై కొనుగోలు చేసుకొనేందుకు జాతీయ లఘు పరిశ్రమల కార్పొరేషను సహాయపడుతుంది.

## స్టీలు ట్రంకులు

స్టీలు ట్రంకులనేవి నిత్య వాడకం వస్తువులు. జనాభా పెరుగుతున్నకొద్దీ ప్రజల ఆదాయం ఎక్కువవుతున్నకొద్దీ వీటి వినియోగంకూడా పెరుగుతూ వుంటుంది.

1957-58 లో చిత్తూరు జిల్లాలో ఈ స్టీలు ట్రంకులకు లక్ష రూపాయలకు పైగా గిరాకీ వుంది.

ఈ జిల్లాలో స్టీలు ట్రంకుల్ని తయారుచేసే యూనిట్లు తొమ్మిది వున్నాయి. ఈ జిల్లా అవసరాలలో 54 శాతం మాత్రమే యీ యూనిట్లు తీర్చగలుగుతున్నాయి.

జనాభా పెరుగుతున్న దృష్ట్యానూ, ఆదాయాలు ఎక్కువవుతున్న దృష్ట్యానూ భవిష్యత్తులో స్టీలు ట్రంకులకు మరింత ఎక్కువ గిరాకీ ఏర్పడవచ్చు.

ఈ జిల్లా అవసరాలకు యిప్పటి ఉత్పత్తికన్న రెట్టింపు జరగవలసివున్న దృష్ట్యా యిటువంటి యూనిట్లను మరి కొన్నిటిని ఏర్పాటు చేసుకోవచ్చు. ఈ పరిశ్రమకు ఇక్కడ మంచి భవిష్యత్తు వుంది.

## స్టీలు ట్రంకుల అనుబంధ పరికరాలు

క్లిప్పులు, తాళాలు, హేండిల్‌లువంటి స్టీలు ట్రంకుల తయారీలో వాడే అనుబంధ పరికరాలను ఏటా చిత్తూరు జిల్లాలో రూ. 70,000 విలువ మేరకు వినియోగించడం జరుగుతోంది.

ఏటా యీ పరికరాలకు 10-15 శాతం గిరాకీ పెరుగుతున్నట్టు అంచనా.

ఈ ప్రాంతంలో వీటని తయారుచేసే యూనిట్లు లేనే లేవు. అలీఘర్ నుంచీ, ఢిల్లీ నుంచీ దిగుమతి చేసుకుంటున్నారు.

ఈ పరికరాలను తయారు చేయడానికి అవసరమయ్యే ముడిసరకులు-ఇత్తడి షీట్లు, టిన్నుషీట్లు, ఎం. ఎస్. షీట్లు, రాడ్లు.

సంప్రదాయకంగా వస్తోన్న నిపుణులైన కమ్మరి పనివారలు యీ జిల్లాలో వున్నారు.

## చేనేత మగ్గాల అనుబంధ పరికరాలు

చేనేతమగ్గాలలోవాడే ఫ్రేమ్‌లు, మోషన్ అటాచ్‌మెంటులు ఆసులు, కండెలు, తదితరములైన అనుబంధ పరికరాలు చిత్తూరు జిల్లాలో ఏటా రూ. 1.2 లక్షల విలువైనవి అవసరమౌతాయి.

వీటిని తయారుచేసే యూనిట్లు యీ జిల్లాలో లేవు. వీటిని బొంబాయి నించి దిగుమతి చేసుకుంటున్నారు.

వీటిని తయారుచేసే యూనిటు కనీసం ఒకదానినైనా యీ జిల్లాలో నెలకొల్పుకోవచ్చు.

## తాళం కప్పలు

చిత్తూరు జిల్లాలో ఏటా రూ. 35,000ల విలువగల తాళం కప్పలు అవసరమౌతాయి.

తిరుపతిలో విశ్వవిద్యాలయ ప్రాంతంలో వూరు పెరగడం వల్లా, ప్రజల ఆదాయం ఎక్కువ అవడం వల్లా, యాత్రికుల రాకపోకలు పెరగడం వల్లా తాళం కప్పల గిరాకీ కూడా ముందు ముందు పెరుగుతుంది.

ప్రస్తుతం అలీఘర్, ఉత్తరప్రదేశ్, దిండిగల్‌లనుండి మద్రాసులోని వర్తకులద్వారా తాళంకప్పల్ని దిగుమతి చేసుకోవడం జరుగుతోంది.

ఇక్కడ శిక్షణ-ఉత్పత్తి కేంద్రాన్ని ఒకదానిని నెలకొల్పడంతో తాళం కప్పల తయారీకి మంచి అవకాశం ఏర్పడింది. పుత్తూరు తాలుకాలోని తడుకుపేటలో నిపుణులైన పనివారు లభిస్తారు.

## ప్లాస్టిక్ వస్తువులు

ఆటబొమ్మలు, బొత్తాలు, సబ్బుపెట్టెలు వంటి ప్లాస్టిక్ వస్తువులను యిక్కడ దాదాపు రూ. 60,000ల విలువమేరకు వినియోగిస్తున్నారు.

యావద్భారత దేశంనించి తిరుపతికి రోజూ వేలాది యాత్రికులు వస్తూ వుండడం వల్లే యీ రకమైన విలాస వస్తువులకు యిక్కడ మంచి గిరాకీ వుంది.

ఆటవస్తువులు తదితర ప్లాస్టిక్ వస్తువుల్ని ఇంజెక్షన్ మోల్డింగ్ పద్ధతిలోనూ, బ్లో మోల్డింగ్ పద్ధతిలోనూ తయారు చేయవచ్చు. చేతో పనిచేయించే ఇంజక్షన్ మోల్డింగు ప్రెస్‌లు, బ్లో మోల్డింగ్ ప్రెస్‌లు దేశవాళీ రకాలు దొరుకుతాయి.

కొన్ని ప్లాస్టిక్ వస్తువుల్ని తయారుచేయాడానికి ఉపయోగించే పోలిథిన్ పలుకులను యిక్కడే తయారుచేసుకోవచ్చు.

ఇక్కడవున్న గిరాకీదృష్ట్యా చేత్తో పనిచేయించే ఇంజక్షన్ మోల్డింగ్ ప్రెస్‌లు, బ్లో మోల్డింగ్ ప్రెస్‌లు గల రెండు మూడు చిన్న తరహా పరిశ్రమల్ని తిరుపతిలోనూ, దాని పరిసరాలలోనూ నెలకొల్పుకోవచ్చు.

## పండ్ల నిలవ

ఈ జిల్లాలో ముఖ్యంగా పండే పండ్లు—మామిడి, నిమ్మ. ఇవి చాలా విస్తారముగా ఈ జిల్లాలో లభిస్తాయి.

పరిసర ప్రాంతాలకు వీటిని యిప్పుడు ఎగుమతి చేస్తున్నారు.

పచ్చడులు, జామ్‌లు, లెమన్ స్క్వాష్‌లను తయారు చేసే చిన్నతరహా పండ్లవిలువ యూనిటును ఒకదానిని యీ జిల్లాలో నెలకొల్పుకోవచ్చు.

## బట్టల సబ్బు

ఈ జిల్లాలో 1957–58లో 3 లక్షల రూపాయల విలువ మేరకు బట్టల సబ్బులకు గిరాకీ వుంది.

ముందుముందు వీటికి గిరాకీ పెరుగేటట్లు వుంది.

ప్రస్తుతం యీ జిల్లాకు కావలసిన బట్టల సబ్బుల్ని యితర జిల్లాలనుంచి దిగుమతి చేసుకోవడం జరుగుతోంది.

దీనిని తయారుచేయడానికి కావలసిన నూనె, కాస్టిక్ సోడా తేలిగ్గానే లభ్యమౌతాయి.

వీటిని తయారు చేయడానికై చిత్తూరులోగాని, మదనపల్లెలోగాని యూనిట్లను నెలకొల్పుకోవచ్చు. ఈ రెండూ చక్కటి అనువైన ప్రాంతాలు.

## ముఖానికి రాసుకునే పౌడరు, పళ్ళపొడి

ఈ జిల్లాలో ఏటా లక్ష రూపాయల ఫేస్‌పౌడరు వినియోగించబడుతోంది.

వార్షికంగా 25 శాతం చొప్పున దీనికి గిరాకీ పెరుగుతున్నట్టు అంచనా.

దీనిని తయారుచేసే యూనిటు ఒకటికూడా ఈ జిల్లాలో లేదు. ఇతర జిల్లాల నుంచి దీన్ని దిగుమతి చేసుకుంటున్నారు.

దీన్ని తయారు చేయడానికి ముఖ్యమైన ముడి పదార్థాలు— చందనపు నూనె, సుద్దరాయి. యివి ఈ జిల్లాలో విరివిగా లభిస్తున్నాయి.

ఫేస్ పౌడర్‌ను తయారుచేసే యూనిట్లే పళ్ళపొడిని కూడా తయారుచేయవచ్చు.

ఈ యూనిట్లను నెలకొల్పడానికి చిత్తూరు, తిరుపతి అనువైన ప్రాంతాలు.

## పెంకులు

పెంకుల్ని తయారుచేసే యూనిట్లు చిత్తూరు జిల్లాలో కొన్నే వున్నాయి.

ఇక్కడ తయారు చేయబడే పెంకులు సాధారణంగా మంగళూరు రకం, సిలింగ్ రకానికి చెందినవి.

వీటిని తయారు చేయడానికి ముఖ్యమైన ముడిపదార్థాలు బంకమన్ను, వంట చెరకు, ఇవి విరివిగా యీ జిల్లాలో లభిస్తాయి.

రాష్ట్రానికి అవసరమైన పెంకుల్లో 30 శాతం మాత్రమే. యిక్కడి యూనిట్లు తయారు చేస్తున్నాయి. మిగిలిన వాటిని పొరుగు రాష్ట్రాలనుంచి దిగుమతి చేసుకోవడం జరుగుతున్నాయి

పబ్లిక్, ప్రయివేటు రంగాల్లో నిర్మించే యిళ్ళను బట్టి పెంకుల గిరాకీ ఆధారపడి వుంటుంది. ఇళ్ళ నిర్మాణం చాలా శీఘ్రగతిని అభివృద్ధి చెందుతున్న దృష్ట్యా పెంకుల గిరాకీకూడా ఏడాదికేడాది పెరుగుతూ వస్తోంది.

కనీసం మరొక యూనిటునైనా యిక్కడ నెలకొల్పడానికి అవకాశం వుంది.

## పలకలు

ఈ జిల్లాలో తయారయ్యే పలకలకు దక్షిణాది అంతటా మార్కెటు వుంది

దీనికి అవసరమయ్యే ముడి పదార్థాలు చాలావరకు ఈ జిల్లాకు దిగుమతి అవుతున్నాయి.

(సశేషం)

మనకున్న అపార ఖనిజ సంపదతో
మహత్కార్యాలు సాధించవచ్చు.

# మన రాష్ట్రంలో

# మైక్రోవేవ్ ప్రాజెక్టు

## ఆధునిక వార్తా ప్రసార సాధనం

చిత్రాలు

1. స్థల నిర్దేశం కోసం సర్వే.
2. 80 మీటర్ల మైక్రోవేవ్ టవర్
3. మైక్రోవేవ్ రిపీటర్, స్టేషన్‌లో యాంటెనా
4. బంజారా హిల్స్‌లో 60 మీటర్ల టవర్.
5. నిర్మాణంలోవున్న ఒక మైక్రోవేవ్ స్టేషన్
6. మైక్రోవేవ్ టవర్ దృశ్యం



ఆధునిక జీవితంలో టెలిఫోన్ ప్రధానమైన పాత్ర వహిస్తోంది. ముఖ్యంగా గత పదేళ్ళుగా దీని ప్రాముఖ్యం బాగా పెరిగింది. ఈనాడు సామాన్యుని అవసరాలలో టెలిఫోన్ కూడా ఒకటి. శీఘ్రంగా ట్రంక్ టెలిఫోను చేయడానికి వీలైన నమ్మకమైన ఆధునిక పద్ధతి టెలిఫోను సర్వీసు ప్రజలకు నేడు కావలసివుంది. తంతి, తపాలాశాఖ లక్ష్యం కూడా యిదే. దేశంలోని ఓ ప్రాంతంలోని వ్యక్తి ప్రపంచం లోని ఏ ప్రాంతంలోని వ్యక్తితో నైనా నేరుగా డైల్‌చేసి మాట్లాడ గలిగే సౌకర్యాన్ని కల్పించడం తంతి తపాల శాఖ లక్ష్యం.

నేరుగా ట్రంక్‌కాల్‌చేసే పద్ధతి యిప్పుడు పెద్ద పెద్ద నగరాల మధ్య వాడుకలో వున్నది. ఈ విధమైన ట్రంక్ సర్క్యూట్‌ను కల్పించడంలో అత్యాధునిక పద్ధతే—మైక్రోవేవ్ రేడియో రిలే పద్ధతి.

కలకత్తా, అసన్‌సోల్‌లమధ్య మొట్టమొదటి మైక్రోవేవ్ లింకును 1965 డిసెంబరు 4న ప్రారంభించడం జరిగింది. ఆ తరువాత అసన్‌సోల్, జోర్హట్‌ల మధ్య, అంబాలా—సిమ్లా—చండీఘర్‌లమధ్య, జలంధర్—జమ్ము—శ్రీనగర్‌లమధ్య కూడా ఏర్పాటు చేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఈ మాదిరి మైక్రోవేవ్ రేడియో రిలే పద్ధతిని ప్రవేశపెట్టవలసిన అవసరం ఏర్పడింది. రాష్ట్రంలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికీ, మన రాష్ట్రానికీ ఇతర రాష్ట్రాలకూ వార్తా ప్రసారాలు ఎక్కువయ్యాయి. అందువల్ల ఈ ఆధునిక పద్ధతిని అనుసరించ వలసిన అగత్యం ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరాన్ని బొంబాయికి కలిపే అత్యాధునిక మైక్రోవేవ్ పద్ధతికి ప్రారంభం జరిగింది. పూనా—సికింద్రాబాదు మైక్రోవేవ్ ప్రాజెక్టుకు రూ. 131 లక్షలు ఖర్చవుతుందని అంచనా వేశారు. ఈ ప్రాజెక్టు పూర్తయితే హైద్రాబాదు—షోలాపూర్—పూనాలమధ్య 960 హైక్వాలిటీ ట్రంక్ టెలిఫోన్ సర్క్యూటులను ఇది కల్పిస్తుంది. దీని దూరం 640 కిలో మీటర్లు వుంటుంది.

300—ఛానల్ మైక్రోవేవ్ పద్ధతిలో కలిపే విజయవాడ—తెనాలి—గుంటూరు మైక్రోవేవ్ ప్రాజెక్టు పని చురుకుగా సాగుతోంది. దీనికి రూ. 37 లక్షలు మంజూరైంది. హైదరాబాదు—వరంగల్లులమధ్య 300 ఛానల్ మైక్రోవేవ్‌లను కలిపేపని ప్రస్తుతం కొనసాగుతున్నది. దీనికి రూ. 34 లక్షలు ఖర్చవుతుందని అంచనా. వచ్చే రెండేళ్ళలో యీ మొత్తం పని పూర్తికావచ్చు.


1




3

# రాష్ట్ర ప్రభుత్వ సిబ్బంది సంక్షేమానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలు

ప్రభుత్వ సిబ్బంది సంక్షేమానికి ఎప్పుడూ రాష్ట్ర ప్రభుత్వం అధిక ప్రాధాన్యతనిచ్చి తగుచర్యలు తీసుకుంటున్నది. తన సిబ్బందికి సహాయపడే ఉద్దేశంతో గత రెండేళ్ళుగా అనేక సంక్షేమ, సహాయక చర్యలను ప్రభుత్వం తీసుకుంటూ వచ్చింది. అలాతీసుకున్న కొన్ని చర్యలను గురించి యిక్కడ పరిశీలిద్దాం.

## వేతన నిర్ణాయక సంఘం

ప్రభుత్వం 1965 లో, ప్రభుత్వ సిబ్బంది జీతాల స్కేళ్ళను క్రమబద్ధంగా వర్గీకరించేనిమిత్తం ఏకసభ్య సంఘాన్ని ఒక దానిని ఏర్పాటు చేసింది. ఈ సంఘం 1967 లో తన నివేదికను సమర్పించింది. ఈ నివేదికలో చేసిన సూచనలు నిజానికి సమంజసమైనవే అయినా ప్రభుత్వ సిబ్బందికి అంతగా సంతృప్తిని కలిగించలేక పోయాయి. అందువల్ల యీ నివేదికలో చేసిన కొన్ని సిఫారసుల విషయంలో అవసరమయ్యే మార్పులు చేసే నిమిత్తం ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అధ్యక్షతన ఒక అధికార్ల సంఘాన్ని ఏర్పాటు చేయడం జరిగింది.

ఈ అధికార్ల సంఘం చేసిన సిఫారసులను ప్రభుత్వం ఆమోదించి తదనుగుణంగా తెలుగు నూతన సంవత్సరాది నుంచి అంటే 1969 మార్చి 19 నుంచి కొత్త స్కేళ్ళు వర్తించేవిధంగా ఉత్తర్వులు జారీచేసింది. సవరించబడిన యీ స్కేళ్ళు యించుమించు ప్రభుత్వ సిబ్బంది అందరికీ లాభించే విధంగా వున్నాయి.

## ప్రయాణపు భత్యం

ప్రయాణపు ఖర్చు యిటీవలికాలంలో బాగా పెరగడంవల్ల ప్రభుత్వం జూన్ 13 నుంచి దినభత్యాన్ని పెంచింది. ఇంతకుముందు అమలులోవున్న రేటుమీద మూడోవంతు ఎక్కువ చేసింది. పైగా ప్రస్తుతంవున్న మైలేజి అలవెన్సుతోబాటు, ఒకవేళ హెడ్ క్వార్టర్సును విడిచి 8 గంటలుకన్న మించి వుండవలసివచ్చినప్పుడు పూర్తి దినభత్యాన్నీ, 8 గంటలుకాని, అంతకు తక్కువకాలంగాని వుండవలసి వచ్చినప్పుడు సగం దినభత్యాన్నీ పొందే సౌకర్యం కూడా కల్పించబడింది.

## కరువు వేతనం

కరువు భత్యంలో పెద్ద మొత్తాన్ని 1969_70 నుంచి 'కరువువేతనంగా' మార్చడం జరిగింది. దీనిని పింఛను, గ్రాట్యుటీలతో కలిపి అందజేస్తారు. దీనివల్ల ప్రభుత్వోద్యోగి రిటైరైనప్పుడు అతని చేతికి పెద్దమొత్తం అందుతుంది.

## సంపాదిత సెలవును (ఎరన్డ్‌లీవును) డబ్బు చేసుకునే సౌకర్యం

తమ సంపాదిత సెలవును డబ్బుచేసుకొనే సౌకర్యం ప్రభుత్వ సిబ్బందికి 1969 ఆగస్టు నుంచి లభించింది. దీనిప్రకారం ప్రభుత్వోద్యోగి_అతను గజెటెడ్ ఉద్యోగి అయినా, నాన్‌గజెటెడ్ ఉద్యోగి అయినా ముప్ఫయ్ రోజులకు తక్కువకాకుండా సంపాదిత సెలవు (ఎరన్డ్‌లీవు) తీసుకుని ముప్ఫయ్ రోజులకు మించకుండా తనకు అర్హతవున్న దానిని బట్టి సంపాదిత సెలవును సరండర్ చేసినప్పుడు ఆ ప్రభుత్వోద్యోగికి సెలవుకాలంలో లభించే జీతంతో పాటు సరండర్ చేసిన కాలానికి కూడా దాని కనుగుణంగా వేతనం లభిస్తుంది.

## కేంద్ర ప్రభుత్వ కరువుభత్యం రేట్లతో సరిసమానం

1968 జనవరి 1 నుంచి కేంద్రప్రభుత్వోద్యోగుల కరువు భత్యంతో రాష్ట్ర ప్రభుత్వ సిబ్బంది కరువు భత్యాన్ని సరిసమానం చేయడం జరిగింది. దీనితో రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల చిరకాల వాంఛ నెరవేరింది. ఆ తరువాత కేంద్ర ప్రభుత్వోద్యోగుల కరువు భత్యంలో పెరుగుదల ప్రకారం రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల కరువుభత్యం కూడా పెరుగుతూవస్తోంది.

## గ్రామోద్యోగుల అలవెన్సులు

జిల్లా స్థాయి పరిపాలనా నిర్వహణలో వెన్నెముక వంటి వారనదగిన గ్రామోద్యోగులకు సైతం, ప్రభుత్వోద్యోగులకు కరువు భత్యాన్ని పెంచినపుడెల్లా వారికి గూడా తగువిధంగా తాత్కాలిక కరువుభత్యం యివ్వడం జరుగుతోంది.

## కుటుంబ పింఛనుల పెంపుదల

ప్రభుత్వోద్యోగి విధి నిర్వహణలో మరణించి నప్పుడు, అతను ఆఖరిసారిగా తీసుకున్న మూలవేతనంలో 50 శాతం మేరకు అతని కుటుంబానికి యివ్వబడుతుంది. అయితే యీ మొత్తం, మామూలు నియమావళి ననుసరించి ఆ ప్రభుత్వోద్యోగి కుటుంబానికి యిచ్చే అర్హమైన పింఛను మొత్తానికి రెండింతలకు లోబడి వుంటుంది. ఆ ఉద్యోగి చనిపోయిన తేదీ నుండి ఏడు సంవత్సరాల గాని, లేదా అతను సర్వీసులోవుంటూ మామూలుగా పింఛనుకు అర్హమైన వయసు వచ్చిన తేదీ నాటికిగాని_ఏది తక్కువైతే అంతకాలం మేరకు___ యీ పింఛను యివ్వబడుతుంది.

## పింఛను రేట్ల పెంపుదల

నిత్యజీవితావసర వస్తువుల ధరలు పెరిగిన కారణంగా జీవన వ్యయం అధికమైనందున కొంతవరకు సహాయపడే ఉద్దేశంతో 1969 సెప్టెంబరు 1 నుంచి పింఛనులలో నెలకు మరో 10 రూ. చొప్పున ప్రభుత్వం హెచ్చించింది. నెలకు రూ 200 లు అంతకు తక్కువ పింఛను పొందే ప్రభుత్వ పింఛను దార్లకు యిది వర్తిస్తుంది.

## వివాహాలకు అడ్వాన్సు

ప్రభుత్వ సిబ్బంది వివాహాలకు, వారి కొడుకులు, కూతుళ్ళ వివాహాలకు అడ్వాన్సులను యివ్వడానికి ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.

## ఉపాధ్యాయుల వేతనాలు నేరుగా చెల్లింపు

ఉపాధ్యాయుల వేతనాలను నేరుగా ప్రభుత్వ కోశాగారాల నుంచి చెల్లింపు చేయడానికి వీలుగా పంచాయతీరాజ్ సంస్థలలో విద్యా విషయక నిధిని ఏర్పాటు చేస్తూ 1968 మార్చిలో ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. ఉపాధ్యాయులకు జీతాలను తమ జనరల్ ఫండ్ నుంచి చెల్లింపుచేసే సౌకర్యాన్ని కల్గిస్తూ 1969 లో జిల్లా పరిషత్తులకు, పంచాయతీ సమితులకు ప్రభుత్వం 1969 లో ఉత్తర్వులు జారీచేసింది. ఈ మొత్తాన్ని ప్రభుత్వం తర్వాత భర్తీ చేస్తుంది.

---

## పరిపాలనా విషయాలు :

### బియ్యం మిల్లులలో కార్మికులకు కనీస వేతనాల నిర్ణయం

రాష్ట్రంలో బియ్యం మిల్లులు, పిండి మిల్లులలో పనిచేసే వివిధ వర్గాలకు చెందిన పనివారలకు కార్మికులకు రాష్ట్ర ప్రభుత్వం కనీస వేతనాలను నిర్ణయించింది. ఈ ప్రకటన ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రచురించబడిన తేదీనుంచి ఇవి అమలోకి వస్తాయి.

ఈ నిర్ణయం ప్రకారం ఈ మిల్లులలో పనిచేసే మేనేజర్లకు కనీస వేతనం నెల ౧కి రూ. 200 లు, అక్కౌంటెంట్లకు 150 రూ. లు టైపిస్టులకు రూ. 160 లు ఇతర పనివారలకు రు. 78లు వుంటాయి. ఎలక్ట్రిషియనులకు, వెల్డర్లు, కమ్మరి, పైప్‌మెన్, రోలర్‌మెన్, సిల్కుమెన్, వైర్‌మన్, మార్కర్, అసిస్టెంటు మేస్త్రీ కళాసీలకు మున్నగువారికి వారివారి పనులను బట్టి రోజు ౧కి రూ. 3.25 పైసలనుంచి రూ. 3.75 లు మజూరి వుంటుంది. ఈ వర్గానికి చెందినవారి జీతం నెల ౧కి రూ. 78 ల నుంచి రూ. 110 ల వరకు వుంటుంది. రోజువారీ జీతంపైన నియమింపబడిన వారికి రోజు ౧కి రూ. 3 ల చొప్పున జీతం వుంటుంది. పిల్లలను పనిలో చేర్చుకొన్నట్లయితే, ఆ వర్గానికి నిర్ణయించిన జీతంలో 75 శాతం యివ్వబడుతుంది.

ఇంజను డ్రైవర్లు, బాయిలర్ అటెండెంట్లు, మెకానిక్‌లకు రోజు ౧ కి రూ. 4-20 పైసలు లేదా నెల 1 కి రూ. 125 లు కనీసవేతనం వుంటుంది.

### కమ్యూనిటీ రేడియో సెట్లు - నిర్వహణ ఖర్చులు

1968 ఏప్రిల్ 1 వ తేదీనుండి మూడు సంవత్సరాల వరకు అన్నిరకాల కమ్యూనిటీ రేడియో సెట్ల నిర్వహణ ఖర్చులు ఆంధ్ర ప్రాంతంలో సెట్టుకు రు. 90 ల చొప్పున తెలంగాణా ప్రాంతంలో సెట్టుకు రు. 75 ల చొప్పున కొనసాగించాలని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది.

1964 ఏప్రిల్ 1 వ తేదీనుండి కమ్యూనిటీ రేడియో సెట్ల నిర్వహణ ఖర్చులు ఆంధ్ర ప్రాంతంలో రు. 90 ల చొప్పున, తెలంగాణా ప్రాంతంలో రు. 75 ల చొప్పున ఉండేవి. అయితే 1968 ఏప్రిల్ 1 వ తేదీనుండి యీ రేట్లను ఆంధ్ర ప్రాంతంలో రు. 135 లకు, తెలంగాణా ప్రాంతంలో రు. 115 లకు పెంచుతూ పూర్వం నుండి వర్తించే విధంగా గత సంవత్సరం ఉత్తర్వులు చేయడం జరిగింది.

తమ ఆర్థిక పరిస్థితులు పరిమితంగా ఉన్న కారణంగా పెంచిన రేట్లను తాము చెల్లించలేమనీ, పాత రేట్లనే పునరుద్ధరించాలని పంచాయతీల నుండి విజ్ఞప్తులు అందాయి.

ప్రభుత్వం యీ సమస్యను శ్రద్ధగా పరిశీలించి మూడు సంవత్సరాలవరకు పాత రేట్లనే కొనసాగించాలని ఉత్తర్వులు జారీచేసింది.

# మహాభారతము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

జనమేజయా! ఆ తరువాత యుధిష్ఠిరుడు కౌశికీ నదీతీరములోని సర్వ తీర్థములను పుణ్యక్షేత్రములను సేవించి పిదప గంగా సాగర సంగమమునకు పోయి; యచటి ఐదువందల తీర్థములను సేవించెను. అచటినుండి కళింగ దేశమునకు పోయెను. అచట 'వైతరణీ' నది ప్రవహించుచుండెను. ఆ నదీతీరమునందే పూర్వము యమధర్మరాజు దేవతలను ఆశ్రయించి యాగములను చేసియుండెను. అతడు యజ్ఞముచేసిన యీ నది ఉత్తర తీరము మహా పుణ్యప్రదమని అనేక ముని పుంగవులు దానిని సేవించుచుందురు. స్వర్గమునకు పోవు పుణ్యాత్ములగు మనుష్యులకీ స్థానము 'దేవయానము'తో సమానమైనది. పూర్వమిచటనే రుద్రుడు పశువులను గ్రహించి 'యీ పశువు నా భాగము' అని చెప్పెను. అది చూచి దేవతలు రుద్రునితో 'నీవు ఇతరుల యజ్ఞభాగమును తీసికొనగూడదు. ఇది మాకు ధర్మసాధనమగు యజ్ఞభాగము' అని చెప్పిరి. అనేక విధముల స్తోత్రములు పూజలు చేసిన తరువాత రుద్రుడు ప్రసన్నుడై ఆ పశువును విడిచి దేవయాన మార్గముద్వారా వెడలిపోయెను. అప్పుడు దేవతలు రుద్ర భయముచేత యజ్ఞములలో సర్వోత్తమమగు భాగమును రుద్రునకు ఇచ్చుటకు సంకల్పించిరి. కనుక ధర్మరాజా! ఈ స్థానమును సేవించి యీ తీర్థమునందు ఆచమనముచేసిన వారికి దేవయాన మార్గము ప్రత్యక్షముగా కనపడును. అది విని పాండవులు వైతరణిలో స్నానాదులు చేసి పితృదేవతలకు తర్పణముచేసిరి. అప్పుడు యుధిష్ఠిరుడు లోమశునితో 'నేనీ నదిలో స్నానముచేసి అధిక తపో బలమును పొంది మానవ సంబంధములగు ప్రాకృత విషయములనుండి విముక్తుడనైతిని కనుక నీ యనుగ్రహముతో సర్వ లోకములను చూడగలుగుచున్నాను. ఇచట మునుల ధ్వని వినపడుచున్నది" అనెను. అది విని లోమశుడిట్లనెను:—

'యుధిష్ఠిరా! యీ ధ్వని మూడు లక్షల యోజనముల దూరమునుండి వినపడుచున్నది. కనుక నిశ్శబ్దముగా నుండి వినుచుండుము.'

'రాజా! ఇది బ్రహ్మదేవుని వనము. ఇచటనే విశ్వకర్మ యజ్ఞములు చేసియుండెను. ఇచ్చోటనే పూర్వము బ్రహ్మదేవుడు సమస్త భూమండలములను కశ్యపునకు యజ్ఞ దక్షిణగా నిచ్చియుండెను. అప్పుడు భూదేవి మిగుల కోపించుచు బ్రహ్మతో 'మహాత్మా! నన్ను మానవునకు ఈయకుము. అట్లైనచో నేనిపుడే పాతాళలోకమునకు పోయెదను.' అని చెప్పెను. అట్లు దుఃఖించుచున్న భూదేవిని కశ్యపుడు శాంతింపజేసెను. భూదేవి ప్రసన్నురాలై జలమునుండి పైకి వచ్చి వేది రూపములో నిలిచెను. రాజా! ఇచట కనపడు వేదికయే అది. దీనిపైన ఎక్కి నిలిచినచో మహావీర్య వంతుడవయ్యెదవు! వేదిక రూపములోనున్న యీ పృథివియే సముద్రమును ఆశ్రయించి యున్నది. నీ వొక్కడవే యీ వేదిక పైన ఎక్కి సముద్రమును దాటుము. నేను నీ కొరకు శుభ కర్మలు సలుపుచుండెదను. వాటి ప్రభావముతో నీవు దీనిపైన ఎక్కజాలుదువు. అట్లు కానిచో, ఈ వేదిని మనుష్యుడు తాకిన వెంటనే అది సముద్రములోకి పోవును. కనుక ఏ మానవుడైనను సముద్ర స్నానమునకు పూర్వము విష్ణువునకు అధిష్ఠానము, సూర్యునకు, అగ్నికి, జలమునకు ఉత్పత్తి కారణము, పరమాత్ముని వీర్య శక్తి అమృతోత్పత్తికి స్థానము నగు సముద్రమును స్మరించి ఈ వేదిక పైన ఎక్కవలెను. నీవును అట్లే చేయుము. పై విధముగా స్తుతించక సముద్రమును కుశాగ్రముతోనైన తాకజాలడు.' అని చెప్పెను. లోమశుని ఉపదేశము ప్రకారము యుధిష్ఠిరుడు సముద్ర స్నానము చేసి మహేంద్ర పర్వతమునకు పోయి ఆ రాత్రి గడపెను.

## పరశురామ చరిత్ర

మరునాడు లోమశుడు తెలుపగా అచట నున్న మునీశ్వరులకు నమస్కారము చేసి ధర్మరాజు వారి యాశీస్సులను గొనెను. వారిలో 'అకృతవ్రణుడు' అను పరశురాముని అనుచరుడు ఉండెను. ఆ మునికి నమస్కరించి యుధిష్ఠిరుడు 'మహాత్మా! పరశురాముడు ఈ మునులను దర్శించుట కెపుడు ఇచటికి వచ్చును? అతని దర్శనము చేయుటకు కుతూహల పడుచున్నాను.' అని అకృతవ్రణుని అడిగెను, ఆ మాట కతడు 'రాజా! నీ విటకువచ్చుచుండుట పరశురామునకు తెలిసియేయుండును. కనుకనే అతడిపుడు ఇచటికి వచ్చుచున్నాడు. నీయందు అతనికి ప్రీతి మెండుగా నున్నది. ఈ మునులు పరశురాముని చతుర్దశినాడు, అష్టమినాడు దర్శింతురు. వీరికి దర్శనమిచ్చుట కతడు రేపు చతుర్దశి గనుక ఇచటికి వచ్చును. నీవును దర్శించవచ్చును.' అని చెప్పెను. ఆ మాట విని యుధిష్ఠిరు డతనితో "మహాత్మా! నీ వతనికి అనుచరుడవుగా నుండి యతని పూర్వ వృత్తాంత మంతయు ప్రత్యక్షముగా చూచి యుందువు. కనుక అతడు పూర్వము యుద్ధములో క్షత్రియుల నెట్లు సంహరించెను? ఎందులకు క్షత్రియులపై పరశురామునకు వైరము కలిగెను? ఆ కథ చెప్పుము.' అని యడిగెను. దానికి అకృతవ్రణుడిట్లు చెప్పదొడగెను:

"పూర్వము 'హైహయ' దేశాధీశ్వరుడగు 'కార్తవీర్యార్జునుడు' అనురాజు ఉండెను. అతనికి వేయి బాహువులు ఉండెను. దత్తాత్రేయస్వామి యొక్క వరప్రసాదము చేత అతనికి బంగారు రథము లభించి యుండెను. ఆ స్వామి యతనికి ప్రపంచములో సర్వ జంతువులపైనను ప్రభుత్వము సాగించుటకు గూడ వరమిచ్చియుండెను. ఆ కాంచన రథము అడ్డులేక ఏ దేశమైనను తిరుగగలుగుచుండెను. ఆ రథము చేతను, వరప్రభావముచేతను, కార్తవీర్యార్జునుడు అంతటను సంచరించుచు దేవతలను, ఋషులను సమస్త భూతములను పీడించుచుండెను. అప్పుడు దేవతలు, ఋషులు జగత్పతియగు విష్ణుదేవునికడకు పోయి కార్తవీర్యార్జునుని దుండగములు చెప్పి అతనినేలాగైనను సంహరించవలసినదని మొర పెట్టుకొనిరి.

"అది విని విష్ణువు కార్తవీర్యుని చంపుటకుగాను ఉపాయములను గూర్చి యింద్రునితో మంతనములు సలిపెను. ఇంద్రుడు తెలిపిన ఉపాయముల ప్రకారము కార్యము చేయదలచి విష్ణువు అచటినుండి బదరీవనములో నున్న తన యాశ్రమమునకు పోయెను.

## అశ్వతీర్థం

ఆ సమయమునందే భూమండలములో 'కాన్యకుబ్జ' నగరమునందు 'గాధి' యను మహారాజు రాజ్యమేలుచుండెను. అతడు రాజధానిని విడిచి వనమునకు పోయి నివసింప దొడగెను. ఆ వనవాస కాలమునందు అతనికొక కన్యక జనించెను. ఆమె అత్యంత సౌందర్యవతిగా నుండెను. ఆమెను భృగువంశోత్పన్నుడగు 'ఋచీకుడు' అను మునీశ్వరుడు వరించెను. అప్పుడు గాధి రాజు ఋచీక మునితో నిట్లనెను :—'బ్రాహ్మణోత్తమా ! మా వంశములో పూర్వము నుండి శుల్కము తీసికొని కన్య నిచ్చు నియమము మా పూర్వులు ఏర్పరచినారు. ఆ నియమమును తప్పక నేను గూడ పాలించవలెను. ఆ శుల్కము (సుంకము) ఏమనగా, ఒక వేయి జవనాశ్వములు (వేగముగా పరుగెత్తు గుఱ్ఱములు) ఈయవలెను. ఆ గుఱ్ఱములు తెల్లగా నుండి చెవులు మాత్రము నల్లగా నుండవలెను. మహాత్మా ! నీవు సత్కులసంజాతుడవు. నీకు కన్యను తప్పక యిచ్చెదను. కాని శుల్కమిచ్చి కన్యను గొనిపొమ్ము.' ఆ మాటకు ఋచీకుడు అంగీకరించి, తనకు అటువంటి అశ్వములను ప్రసాదించుము' అని వరుణదేవుని ప్రార్థించెను. వరుణుడు సంతుష్టుడై వేయి గుఱ్ఱములను ఋచీకునకు ఇచ్చెను. ఆ యశ్వములు పుట్టినచోటునకు 'అశ్వతీర్థము' అను ప్రసిద్ధి యేర్పడెను.

ఆ తరువాత గాధిరాజు ఆ యశ్వములను కన్యాశుల్కముగా తీసికొని గంగాతీరమునందలి కాన్యకుబ్జ నగరమునందు తన కూతురగు 'సత్యవతి'ని ఋచీకునకిచ్చి పెండ్లి చేసెను. ఆ వివాహమునకు దేవతలు గూడ వచ్చిరి. పెండ్లి తరువాత ఋచీకుడు సత్యవతితో యథేచ్ఛగా విహరించుచుండెను. కొడుకును కోడలిని చూచి ముచ్చట పడుటకు భృగుమహర్షి గూడ ఆ యాశ్రమమునకు వచ్చెను. ఆ దంపతులు భృగుమహర్షికి నమస్కరించి అతనిని ఉపాసించుచు దగ్గర కూర్చుని యుండిరి. భృగువు సంతుష్టుడై "వరము కోరుకొనుము. ఇచ్చెదను." అని కోడలగు సత్యవతితో ననెను. ఆమె, తనకును తన తల్లికిని కుమారులు కలుగునట్లు వరమునిమ్మని ప్రార్థించెను. ఆమె యెడల ప్రసన్నుడై భృగుమహర్షి యిట్లనెను :— బిడ్డా ! నీవు, నీ జనని ఋతుస్నానము చేసి పుత్రార్థినులై నీవు ఉదుంబర వృక్షమును (మేడిచెట్టు), మీ తల్లి అశ్వత్థ వృక్షమును (రావిచెట్టు) ఆలింగనము చేసికొనుడు. నేను భగవంతుని ధ్యానించి రెండు చరువులను సిద్ధము చేసినాను. ఒకటి నీకు మరియొకటి నీ తల్లి కొరకు ఇచ్చుచున్నాను. మీ మీ చరువు (అన్నము పాత్ర) లను భక్షణము చేయుడు.' అని చెప్పి అంతర్ధానము చెందెను.

భృగుమహర్షి పోయిన పిదప సత్యవతి తల్లి మోసముచేసి, కూతురు ఆలింగనము చేసికొనవలసిన ఉదుంబర వృక్షమును తాను కౌగిలించుకొని కూతురి చరువును భక్షించెను. కూతురు అశ్వత్థమును ఆలింగనము చేసికొని తల్లి చరువును భక్షించెను. ఈ విషయమును భృగుమహర్షి దివ్యదృష్టితో కనుగొని తిరిగి ఆ యాశ్రమమునకు పోయి సత్యవతితో నిట్లనెను :—'బిడ్డా! మీ తల్లి నిన్ను మోసగించి నీ వృక్షమును ఆమె ఆలింగనము చేసికొని నీచరువును భక్షించెను. నీవు ఆమెకొరకు ఏర్పరచిన వాటిని అనుభవించితివి. అందుచేత క్షత్రియ వృత్తిగల బ్రాహ్మణుడు నీకు పుట్టును. బ్రాహ్మణాచారముగల క్షత్రియుడు మీ తల్లికి జనించును. అతడు మహాతేజశ్శాలియై తపస్సంపన్నుడై యుండును.

ఆ మాటవిని సత్యవతి, మామగారితో 'మహాత్మా! అట్టి కొడుకు నాకక్కరలేదు. ఒకవేళ నా పౌత్రుడు క్షత్రియుడైనను అగుగాక. నాకు బ్రాహ్మణపుత్రుడే కలుగునట్లు అనుగ్రహింపుము.' అని వేడుకొనెను. అతడు సంతుష్టుడై అట్టి వరమును ప్రసాదించెను. పిదప కొంత కాలమునకు సత్యవతి 'జమదగ్ని'ని కనెను. అతడు పెరిగి పెద్దవాడై మహా తేజస్వి యయ్యెను. సమస్త వేదశాస్త్రములు అతనికి స్వయముగా భాసించెను. ధనుర్వేదమునందు గూడ పారంగతుడయ్యెను.

జమదగ్ని శౌచాదినియమములను పాటించి దేవతలను గూడ స్వాధీనము జేసికొనెను. అతడు 'ప్రసేనజిత్తు' అను రాజును కోరి అతని కూతురగు 'రేణుక' ను పెండ్లియాడెను. ఆమెతోనే కలిసి యాశ్రమములో నివసించుచు తపస్సు ఆచరించుచుండెను. ఆమె వలన జమదగ్నికి అయిదుగురు కొడుకులు పుట్టిరి. వారిలో కనిష్ఠుడు పరశురాముడు. అతడు సోదరులలో వయస్సుచేత కనిష్ఠుడైనను గుణములో నందరికన్న జ్యేష్ఠుడుగా నుండెను.

పుత్రులందరు ఒకనాడు ఫలములు తెచ్చుటకు వనమునకు పోవగా రేణుక స్నానార్థమై నదికి పోయెను. స్నానము చేసి తిరిగి వచ్చుచుండగా నామె యచట 'మార్తికావత' దేశమునకు రాజైన 'చిత్రరథుడు' అను వానిని చూచెను. అతడు కమలముల మాలనుధరించి భార్యతో జలక్రీడలు సలుపుచుండెను. అట్టివానిని చూచి రేణుక తన మనస్సులో నతనిని కామించెను. ఆమానసిక వ్యభిచారమువలన ఆమె ద్రవించి మైమరచి నీటిలో పడిపోయెను. తిరిగి తేరుకొని భయబడినదై తన యాశ్రమమునకు పోయెను

దానిని జమదగ్ని దివ్యదృష్టితో కనుగొనెను. ధైర్యము సడలి బ్రహ్మతేజము నుండి భ్రష్టురాలైన రేణుకను చూచి జమదగ్ని ధిక్కార పూర్వకముగా నిందించెను.

తరువాత జమదగ్ని పుత్రులగు 'రుమణ్వంతుడు, సుషేణుడు, వసువు, విశ్వావసువు' అను నలుగురు ఆశ్రమమునకు వచ్చిరి. తల్లిని వధించమని క్రమముగా ఒక్కొక్కనిని జమదగ్ని ఆజ్ఞాపించెను. కాని మాతృప్రేమచేత నొక్కడుగూడ మాతృవధ చేయుటకు సాహసించక అందరు ఊరకుండిరి. వెంటనే ఆ ముని కోపించి ఆ నలుగురు కొడుకులను శపించెను. శాపగ్రస్తులై వారు మృగ-పక్షి సమానముగా జడబుద్ధి గలవారైరి.

ఆ తరువాత చివరకు కనిష్ఠుడగు రాముడు రాగా అతనిని గూడ జమదగ్ని 'తల్లిని చంపు' మని యాజ్ఞాపించెను. తండ్రి యాజ్ఞ అయినతోడనే మహాతేజస్వియగు పరశురాముడు తన 'పరశువు' (గండ్రగొడ్డలి)తో తల్లి శిరస్సు ఛేదించెను. అంతటితో జమదగ్ని కోపము చల్లారిపోయి ప్రసన్నుడై యిట్లనెను:- 'నాయనా! నీవు నాయాజ్ఞపై అతిదుష్కరమైన మాతృవధ కార్యము చేసితివి. నేను నీ యెడల చాల ప్రసన్నుడనైతిని. కనుక నీవు కోరినన్ని వరములు ఇచ్చెదను. కోరుకొనుము.'

ఆ మాటలువిని పరశురాముడు తండ్రిని ఈ విధముగా వరములు కోరెను:- 'తండ్రీ! నా తల్లి జీవించునట్లును, నేను ఆమెను వధించినట్లు ఆమెకు స్మృతికి రాకుండునట్లును, మాతృవధ పాతకము నాకు అంటకుండునట్లును, నా అన్నలు నలుగురు స్వస్థులై పూర్వమువలె ఉండునట్లును, యుద్ధములో నన్ను ఎదిరించగల వీరులు లేకుండునట్లును, నాకు దీర్ఘాయుష్యము కలుగునట్లును వరములు ప్రసాదించుము.' అని కోరెను. తండ్రి జమదగ్ని ప్రసన్నుడై పరశురాముడు కోరిన వరములన్నియు నిచ్చెను.

ఇట్లుండగా నొకనాడు జమదగ్ని పుత్రులందరు వనమునకు పోయి యుండినపుడు 'అనూప' దేశాధిపతియగు 'కార్తవీర్యుడు' అను మహావీరుడు జమదగ్ని యాశ్రమమునకు వచ్చెను. అతనికి జమదగ్ని భార్య ఆతిథ్య సత్కారములు చేసెను. యుద్ధమదమత్తుడగు నారాజు ఆమె చేసిన పూజలకు ఇష్టపడక ఆశ్రమమును ఛిన్నాభిన్నమొనర్చి యచ్చట ఆక్రోశించుచున్న హోమధేనువు యొక్క దూడను అపహరించుకొని పోవుచు ఆశ్రమ వృక్షములను విరిచి కూలద్రోసి పోయెను.

ఆ తరువాత కొంతసేపటికి వచ్చిన పరశురామునకు జమదగ్ని మహాముని జరిగిన సమాచారమునంతయు తెలిపెను. పరశురాముడదివిని, యచట నేడ్చుచున్న హోమధేనువును గూడ చూచి మిగుల కోపించెను.

కార్తవీర్యార్జునుని వెన్నంటి తరిమి పరశురాముడు అతనితో యుద్ధముచేసి యతని సహస్ర బాహువులను ఛేదించి యతనిని సంహరించెను. పితృవధచేత దుఃఖితులైన కార్తవీర్యార్జునుని పుత్రులు పరశురాముడు లేని సమయమునందు అతని యాశ్రమములో దూరి ఒంటరిగా నున్న జమదగ్ని మునిని సంహరించి పోయిరి. తరువాత పరశురాముడు ఆశ్రమమునకు వచ్చి చచ్చిపడియున్న తండ్రిని చూచి మిగుల దుఃఖించెను. ఆ క్రూరకృత్యము కార్తవీర్యుని కొడుకులు చేసిరని తెలిసి వారి యెడల కోపించెను.

## సమంత పంచకము

ప్రేత కార్యములు ముగించిన తరువాత పరశురాముడు, క్షత్రియ జాతివారు తమ కింతటి యపకారము చేసిరని "భూమండలమునందు క్షత్రియులే లేకుండ అందరిని సంహరించెదను" అని ప్రతిజ్ఞ బూనెను. శస్త్రాస్త్రములు ధరించి బయలుదేరిపోయి తొలుత కార్తవీర్యార్జునుని కొడుకుల నందరిని సంహరించెను. వారికి సహాయముగా వచ్చిన క్షత్రియులను గూడ పరశురాముడు మట్టిలోగలిపెను. తరువాత అతడు ఇరువదియొక్క పర్యాయములు భూమండలమంతయు ప్రదక్షిణముచేసి సర్వ క్షత్రియులను సంహరించి వారి నెత్తుటితో 'సమంత పంచక' క్షేత్రములో నైదు మడుగులను నిర్మించెను. ఆ నెత్తుటి మడుగులలో పరశురాముడు భృగువంశోత్పన్నులగు తన పితరులకు నెత్తుటితో తర్పణముచేసెను. అప్పుడచటికి ఋచీక మహాముని ప్రత్యక్షముగా వచ్చి యా క్రూరకర్మనుండి పరశురాముని నివారించెను.

పిదప పరశురాముడు యజ్ఞముచేసి దేవేంద్రుని సంతృప్తి పరచెను. ఋత్విక్కులకు దక్షిణగా, తాను క్షత్రియులను చంపి సంపాదించిన భూమి నంతయు దానముచేసెను. నలువది మూరల వెడల్పు, నలువది మూరల పొడవు, ముప్పదియారు మూరల యెత్తుగల స్వర్ణ వేదికను నిర్మించి దానిని కశ్యపునకు దానము చేసెను. కశ్యపుని యాజ్ఞచేత ఆ సువర్ణవేదికను బ్రాహ్మణులు ముక్కలుచేసి పంచుకొనిరి. అందుచేత వారు 'ఖండ వాయనులు' అని ప్రసిద్ధులైరి.

ఈవిధముగా పరశురాముడు సమస్త భూమండలమును కశ్యపునకు దానముచేసి 'ధర్మరాజా! ఈ మహేంద్ర పర్వతమునందు నివసించుచున్నాడు. (భూమికి 'కాశ్యపి' యను పేరు ఆ కారణముచేతనే యేర్పడెను.) ఈ విధముగా పరశురామునకు సమస్త క్షత్రియ జాతితో వైర మేర్పడెను.' అని అకృతవ్రణుడు చెప్పిన పరశురాముని కథ విని యుధిష్ఠిరుడు ఆ మరునాడు చతుర్దశి గనుక అచటికి వచ్చిన పరశురాముని దర్శించి తమ్ములతో నతనిని పూజించి యతని కోరికపై ఆ రాత్రి మహేంద్ర పర్వతమున నివసించెను. ప్రాతఃకాలమున లేచి దక్షిణాభిముఖులై పాండు పుత్రులు వెడలిపోయిరి.

ధర్మరాజు దక్షిణా పథమునందున్న అనేక తీర్థములను సేవించుచు, అనేక నదీ సాగర సంగమ తీర్థములందు స్నానములు చేయుచు, పత్నీ సోదర సహితుడై ప్రభాస తీర్థమునకు పోయెను. అచట జలమును వాయువును భక్షించుచు పన్నెండు దినములు తపస్సుచేసెను. హోమాది కార్యములను నెరవేర్చెను. 'పాండవులు కఠినోపవాసాదివ్రతములు సలుపుచు ప్రభాస తీర్థమునందున్న' సంగతి విని కృష్ణ, బలరాములు అచటికి పోయిరి.

యాదవులందరుగూడ అచట చేరిరి. అక్కడ అనేక కష్టము లనుభవించుచున్న పాండుపుత్రులను చూచి వారు మిగుల దుఃఖితులైరి. అట్టి స్థితిలో నున్నప్పటికిని ధర్మరాజు వారందరికి స్వాగత వచనపూర్వకముగా నతిథి సత్కారములు చేసెను. వారును పాండవులను సత్కరించి ధర్మరాజు చుట్టు, ఇంద్రుని చుట్టు దేవతలు కూర్చున్నట్లు, అందరును కూర్చొనిరి. ధర్మరాజు అనేక ప్రసంగములు వారితో చేయుచు అర్జునుడు దివ్యాస్త్ర సంపాద నార్థమై స్వర్గమునకు పోయిన సంగతి సంతోష పూర్వకముగా చెప్పెను. వారి కష్టములను వినుచు యాదవులు దుఃఖార్తులై అశ్రువులు రాల్చుచు కూర్చుండిరి.

అప్పుడు బలరాముడు కృష్ణునితో నిట్లనెను:—

"కృష్ణా! ధర్మాచరణముగూడ ప్రాణుల యభ్యుదయమునకు కారణము కాదు; అధర్మా చరణముగూడ వారి పరాభవ కారణము కాదని తోచుచున్నది. ఎందుకనగా, ధర్మాత్ముడగు యుధిష్ఠిరుడు వనములో క్లేశము లనుభవించుచున్నాడు; అధర్మపరుడగు దుర్యోధనుడు రాజ్య పాలనము చేయుచున్నాడు. దీనిని చూచి మంద బుద్ధులు ధర్మాచరణముకన్న అధర్మ వర్తనమే మేలని తలచెదరు. ధర్మము నాశ్రయించవలెనా లేక అధర్మము నాయని ప్రజలకు సంశయము కలుగుచున్నది. సర్వదా ధర్మాచరణము చేయుచు ధర్మపుత్రుడై వెలసిన యుధిష్ఠిరుడే యిట్లు ఇడుముల పాలగుచుండగా, అధర్మము నాచరించువారి గతియేమి? వారికి అభ్యుదయ మెట్లు కలుగును? భీష్మాదులగు పెద్దలు ఇట్టి ధర్మాత్ములను అడవులపాలు చేసి యెట్లు సుఖించుచున్నారు. వారెంత నిందనీయులోకదా! పక్షపాత బుద్ధిగల ధృతరాష్ట్రుడు చచ్చి పితృలోకమునకుపోయి యచట తన పితృ దేవతలకు ఎట్లు ముఖము చూపించగలడు? 'పూర్వజన్మమునందు ఎంతటి పాపముచేసియో యిపుడు అంధుడనై జన్మించితిని. ఇప్పుడీ పాపముచేసి ఉత్తర జన్మమున మరి యెట్టి కష్టముల ననుభవింతునో' అనియైన నతడు తలచలేదా! మహా బల పరాక్రమశాలురైన భీమాదుల దుర్గతిని, సుకుమారియగు ద్రౌపది యనుభవించుచున్న దుర్దశను, ధర్మాత్ముడగు యుధిష్ఠిరుని దురవస్థను చూచి యీ భూమి బ్రద్దలుగాక యెట్లున్నది? అని పరి పరి విధముల బలరాముడు విలపించెను.

తరువాత సాత్యకి యిట్లుచెప్పెను:— బలరామా! ఇది ఊరక కూర్చొని విలపించు సమయము కాదు. ముందు చేయవలసిన పనిని గూర్చి మన మందరము యోచించవలెను. ధర్మరాజు మనలనిప్పుడేమియు కోరకున్నను మనము వ్యర్థముగా కాలము గడపకుండ ఇప్పుడు కౌరవులకు సరియైన ప్రతి క్రియ చేయవలెను. ప్రపంచములో సనాథులై—సహాయకులు గలవారు స్వయముగా ఏ కార్యమును చేయుటకు తలపెట్టరు. వారి కార్యములన్నియు వారి మిత్రులే నెరవేర్చుచు సహకరించుచుందురు. ఎవరి కార్యములను తమ మిత్రులు—సహాయకులే స్వకార్యములుగా భావించి చేయుచుందురో అట్టి వారు సనాథుగానే భావింపబడుచుందురు గాని వారు దిక్కులేని వారు కారు. వారికెప్పుడు చూడ కష్టములు కలుగవు. జగత్పతులగు మీరిరువురు, కృష్ణ బలరాములు, సాత్యకి ప్రద్యుమ్నాదులమగు యాదవులము మేము, ఇందరము ఆప్తులము ఉండి కూడ పాండవులు వనవాస క్లేశములను ఎందుకు అనుభవించవలెను? మనమందరము సేనా సన్నాహముతో ఇప్పుడే బయలు దేరి దాడి సలిపి దుర్యోధనాదులను హతమార్చుదము. కృష్ణుని దూరముగా నుంచి నీ వొక్కడవే యీ కార్యమును నెరవేర్చ గలవు. ఈ కార్యమునకు అర్జునుడుగూడ నక్కరలేదు. అతనికి నేను శిష్యుడనుగనుక నేనే యతని పనిని నెరవేర్చెదను. లోకములో సత్పుత్రులు, సచ్ఛిష్యులు ఉండవలెనని తండ్రులు, గురువులు కోరుకొనుచుండుట సంకట సమయములో సహాయము చేయుటకే కదా! ఇప్పుడా పనిచేసి నేను నా గురువగు అర్జునుని ఋణము తీర్చుకొనెదను. గురువుకొరకు బలపరాక్రమములు ప్రదర్శించవలసిన యవసరము వచ్చినది. నా కరకు బాణములచేత శత్రువులను చంపెదెను. నా పరాక్రమమును నేడు చూచెదవుగాక. శత్రుసైన్యమునందు నా బాణాగ్ని పడి గడ్డి వామిని అగ్నివలె క్షణకాలములో సైన్యమునంతయు దగ్ధము చేయగలదు. యాదవ వీరులు సామాన్యులు కారు. భీష్మ ద్రోణాదులను కృష్ణుడొక్కడే నిర్జించగలడు. యుధిష్ఠిరుడు ఆడిన మాట తప్పడు గనుక అతడీ యడవిలోనే పన్నెండేండ్లు ఉండుగాక. మనమీనాడు గెలిచిన రాజ్యమును ధర్మరాజు తిరిగివచ్చుదాక అభిమన్యుడేలు గాక. ఆ తరువాత ధర్మరాజు ఏలుగాక."

సాత్యకి మాటలు విని కృష్ణుడిట్లనెను :— సాత్యకీ ! నీవు చెప్పినట్లు చేయుట మనకు అసాధ్యము కాదు. కాని ధర్మపుత్రుడు దాని కంగీకరించడు. అతడు తన భుజాబలముతోనే సాధించిన భూమిని పాలించును కాని యితరులు సంపాదించి యిచ్చిన రాజ్యమును ఏలడు. అతడు కోరికలచేత కాని, లోభముచేత కాని, స్వధర్మమును వీడడు. ఆ విధముగానే అతని తమ్ములు, భార్య గూడ ధర్మమును వీడువారుకారు. వారికి అసాధ్యమగు కార్యము లేదు. తమ్ములు రాజ్యమును జయించి, తనను గొలుచుచుండగా నతడు ఏల దలచినాడు."

ఆ మాట విని ధర్మపుత్రుడిట్లనెను :— సాత్యకీ ! నీ మాటలు సత్యములే. నీ వంటి పరాక్రమశాలికి అనుగుణముగానే మాట్లాడితివి. కాని, నాకు సత్యవాక్య పరిపాలనమే అన్నిటికన్న ప్రధానమైనది కాని రాజ్యప్రాప్తి కాదు. ఇందరిలో శ్రీకృష్ణుడొకడే నన్ను బాగుగా తెలిసికొనెను. నేను గూడ అతని స్వరూపమును యథార్థముగా గుర్తెరిగినాను. అతడు శత్రువులను జయింప దలచినపుడే మీరందరు గూడ నతనికి బాసటగా రావచ్చును. కనుక ఇప్పుడు మీరందరు తిరిగి వెడలిపొండు. ధర్మపాలనము చేయుచుండుడు."

ఆ మాటలు విని యదువీరులందరు పెద్దలకు నమస్కారము చేసి తమ తమ స్థానములకు పోయిరి. పాండవులు పూర్వము వలెనే తీర్థయాత్రలు సలుపుటకు బయలుదేరిరి. లోమశునితో గూడ వారు విదర్భరాజు పూజించిన 'పయోష్ణి' నదికి పోయిరి. ఆ నదీ జలము సోమరసమిశ్రితమై యున్నది. అచ్చట వారు కొన్ని దినములు నివసించుచుండిరి.

(సశేషము)

# వార్తా చిత్రాలు



100 మంది ప్రయాణీకులకు సరిపడే రెండంతస్థులబస్సు. (నిర్మాణం, ఆల్విన్ మెటల్ వర్క్స్, హైదరాబాదు) ముఖ్యమంత్రి దీనిని జూలై 15 వ తేదీన ఢిల్లీ రవాణా సంస్థ అధ్యక్షునికి అందించారు.



హైదరాబాదు గృహశాస్త్ర కళాశాలలో ఆగస్టు 3 వ తేదీన మహిళా సంక్షేమ, యాత్రా విషయాల మంత్రిణి శ్రీమతి రోడా మిస్త్రీ బలవర్ధకాహార విషయాలలో రిఫ్రెషర్ కోర్సుకు ప్రారంభోత్సవం చేశారు.



భారత, ఫ్రెంచి వాలీబాల్ జట్ల మధ్య లాల్‌బహదూర్ స్టేడియంలో ఆగస్టు 4, 5 తేదీలలో రెండు టెస్టు పోటీలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్ గవర్నరు బహుమతి ప్రదానంచేశారు.



భారతీయ విద్యా భవన్, ఆంధ్రప్రదేశ్ కేంద్రానికి భవన నిర్మాణ సహాయార్థం శ్రీమతి యం. యస్. సుబ్బలక్ష్మి రవీంద్ర భారతిలో ఆగస్టు 8 వ తేదీన గాన కచేరి చేశారు. ఆంధ్రప్రదేశ్ గవర్నరు ప్రధాన అతిథిగా హాజరయ్యారు.



ముఖ్యమంత్రి 61 వ జన్మదినోత్సవం సందర్భంగా ప్రచురించిన అభినందన సంచికను గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ జూబ్లీ హాల్లో జులై 28 వ తేదీన జరిగిన సమావేశంలో విడుదల చేశారు.



ప్రణాళికా సంఘం సభ్యులు శ్రీ ఆర్. వెంకటరామన్ ఆగస్టు 8 వ తేదీన ముఖ్యమంత్రిని కలిశారు. ఉప ముఖ్యమంత్రి, ఆర్థిక మంత్రి, తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులు సంప్రదింపుల్లో పాల్గొన్నారు.

# వార్తా చిత్రాలు



కెనడా హై కమీషనర్ ఘ. వ. శ్రీ జేమ్స్ జార్జి ఆగస్టు 6 వ తేదీన హైదరాబాదులో ముఖ్యమంత్రిని కలిశారు.



న్యూజీలాండ్ ఆక్టింగ్ హై కమిషనర్ శ్రీ డి. యఫ్. డన్‌లప్ జులై 25 వ తేదీన హైదరాబాద్‌లో ముఖ్యమంత్రిని కలిశారు.

# చిత్తూరు జిల్లాలో కుటుంబ నియంత్రణ

—రావూల సూర్యనారాయణమూర్తి

వరుసగా అమలు జరుపబడుతున్న పంచవర్ష ప్రణాళికల మూలంగా భారతదేశం ఆర్థిక సాంఘిక రంగాలలో అసాధారణ ప్రగతిని సాధించింది. వ్యవసాయోత్పత్తి ద్విగుణీకృతమయింది. పారిశ్రామికోత్పత్తి నూటయేభై శాతం పెరిగింది. స్వరాజ్యావతరణ నాటి పరిస్థితితో పోల్చిచూస్తే యిప్పటి విద్యా సదుపాయాలు మూడు రెట్లు అయ్యాయి. మలేరియా, మశూచి, ప్లేగు, కలరా వంటి అంటు వ్యాధులను నిర్మూలించడంకాని, నివారించడంకాని జరిగింది. పద్దెనిమిది సంవత్సరాలలో జాతీయాదాయం 75 శాతం అభివృద్ధి చెందింది. ఇవి మతరహిత ప్రజాస్వామ్యవ్యవస్థలో మనం మూడు దురాక్రమణలను ఎదుర్కొని కూడా సాధించిన ఘనవిజయాలు.

అయితే ఎంతో పురోగతిని ఆశిస్తున్న ప్రస్తుత యుగంలో ఘోరపరాజయాలు కొన్ని మనలను అపహాస్యం చేస్తున్నాయి. ఆహారధాన్యాలు, నూలు దిగుమతి చేసుకోవడం ద్వారా యిప్పటికీ కూటికీ గుడ్డకీ విదేశాలమీద ఆధారపడక తప్పడంలేదు. జనాభాలో మూడింట రెండువంతులమంది నిరక్షరాస్యులుగానే యున్నారు. ఇరవై ఏళ్ల క్రితం 35 లక్షలలో వుండే నిరుద్యోగుల సంఖ్య యిప్పుడు అనేకమంది విద్యావంతులతో-ముఖ్యంగా యింజనీరులతో సహా ఒకకోటిని దాటి అమితంగా ఆందోళన కలగజేస్తున్నది. దేశంలోని సుమారు నాలుగోవంతు గ్రామాలకు సరిగా త్రాగడానికి నీరు కూడా లభించడంలేదు. వైద్య ఆరోగ్య సదుపాయాలు ఏమాత్రం లేకుండా ఎన్నో ప్రాంతాలు యిప్పటికి యిబ్బంది పడుతూనే వున్నాయి.

ఏటేటా 1 కోటి 30 లక్షల వంతున పెరుగుతున్న జనాభా ఈ ప్రమాద పరిస్థితులకు ప్రధానకారణం. ప్రస్తుత స్థాయిలో జరుగుతున్న సంతానాభివృద్ధిని అరికట్టక పోయినట్లయితే ఈ శతాబ్దం పూర్తయ్యేసరికి భారతదేశ జనసంఖ్య 100 కోట్లను చేరుకుంటుంది. ఇది ఆకలిచావులకీ, అకాల మరణాలకీ దారితీసే విషాదకర పరిస్థితి అనడంలో సందేహం లేదు. కనుక అవాంఛనీయమైన ఈ స్థితిని అదుపులోపెట్టే నిమిత్తం మానవత్వంతో కూడిన ఒక వివేకవిహితమైన విధానంద్వారా జననాల స్థాయిని తగ్గించడానికి భారతదేశం కృతనిశ్చయంతో కృషిసాగిస్తున్నది. తనకు కల సాధనసంపత్తికి తగినవిధంగా జనాభాను రూపొందించుకునే ఆ కార్యక్రమమే కుటుంబనియంత్రణ.

ప్రపంచ చరిత్రలో కనీవినీ ఎరుగనంతటి విశాలమూ, విస్తృతమూ అయిన మహోద్యమం కుటుంబనియంత్రణ. వైద్య ఆరోగ్య సంక్షేమ సేవలలో యిదొక అపూర్వ సంఘటన. మానవుడి వ్యక్తిగత ఆంతరంగిక ప్రవర్తనకు సంబంధించిన బహిరంగ చర్చను ఒక నిషిద్ధ కృత్యంగా భావించే సంప్రదాయ సంస్కృతి వ్యక్తిగత ప్రవర్తనతో పరివర్తన తీసుకువచ్చే చర్యలను అంగీకరించడమూ, దాని సాంఘిక పరిణామాలను పరిగణించడమూ విశిష్టమైన విషయం. కుటుంబ నియంత్రణ పథకాన్ని ఒక జాతీయ కార్యక్రమంగా స్వీకరించిన కొద్దిదేశాలలో భారతావని ఒకటి. అందువల్ల వైద్య ఆరోగ్య సేవల పరంపరాగత విధానంలో మార్పు తీసుకురాబడింది. ఆ నూతన దృక్పథం ప్రకారం ప్రజలు వైద్యుల సేవా సహాయాలను అర్థించడానికి బదులు వైద్య సదుపాయాలను ప్రజల వద్దకు తీసుకువెళ్లడం జరుగుతున్నది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఆర్థిక, సాంఘికాభివృద్ధిలో భాగంగా అమలు జరుపబడ్డ కుటుంబనియంత్రణ కార్యక్రమం జననాల స్థాయిని తగ్గించే సురక్షితకాల పద్ధతి ప్రచారం పట్ల దృష్టిని కేంద్రీకృతం చేసింది. ఇక ద్వితీయ ప్రణాళికాంతంలో ఐచ్ఛిక శస్త్ర చికిత్స అంగీకృత విధానంగా రూపొందింది. తృతీయ పంచవర్ష ప్రణాళికలో ఈ కార్యక్రమానికి మంచి గుర్తింపు లభించింది. చికిత్స పద్ధతి నుంచి మరింత శక్తివంతమైన విస్తరణ విధానానికి మార్పు చేస్తూ కార్యక్రమం పునర్వ్యవస్థీకరించబడింది. చతుర్థ ప్రణాళిక కుటుంబనియంత్రణకు అత్యధిక ప్రాధాన్యత యిచ్చింది. ప్రస్తుత దశాబ్దంలో కూడా పరిమిత కుటుంబ పథకం కేంద్ర ప్రభుత్వ ప్రోత్సాహంతో నిర్వహించబడుతుంది.

చిన్న కుటుంబాల ఆవశ్యకతను విశదీకరించే సందర్భంలో అనేకమంది తమకుగల యిద్దరు ముగ్గురు పిల్లలూ బ్రతికి బట్టకడుతారనే నమ్మకమేమిటని ప్రశ్నిస్తున్నారు. శిశువుల చిన్నబిడ్డల మరణాలు మనదేశంలో అత్యధికంగా వుండేవి. కనుక ఎక్కువ మంది పిల్లలు వున్నట్లయితే తమ అవసానదశలో ఆదుకోగలరని తల్లిదండ్రులు భావించే వారు. ఈ పరిస్థితుల్లో జన్మించిన కొద్దిమంది పిల్లలు బాలారిష్టాలనుంచి బయటపడి హాయిగా, ఆరోగ్యంగా ప్రవర్ధమానులు కావడానికి వీలైనన్ని అవకాశాలను కలగ జేయడంలో తనకుగల బాధ్యతను ప్రభుత్వం గుర్తించింది. గత రెండు దశాబ్దాల కాలంలో అమలు జరుపబడ్డ అనేక ఆరోగ్య చర్యల ఫలితంగా శిశుమరణాల సంఖ్య రమారమి సగానికి సగం తగ్గిపోయింది. కుటుంబనియంత్రణ కార్యక్రమంలో మాతా శిశుసంరక్షణ ఒక అంతర్భాగం చేయబడింది.

ఆంధ్రప్రదేశ్ అంతటా 1965-66 లో పునర్వ్యవస్థీకృత కుటుంబ నియంత్రణ కార్యక్రమం అమలు జరుపబడింది. అప్పుడు

యితర జిల్లాలతోపాటు చిత్తూరులో కూడ జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి ఆధ్వర్యంలో జిల్లా కుటుంబనియంత్రణ సంస్థ ఏర్పాటు చేయబడింది. ఈ సంస్థ ఆధిపత్యం క్రింద జిల్లాలో గల 8 పట్టణ కుటుంబ నియంత్రణ కేంద్రాలలోను 22 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలోను అప్పటి నుంచి శస్త్ర చికిత్సలు చేయబడుతున్నాయి. వీటితోపాటు చిత్తూరు ప్రభుత్వ కేంద్ర ఆసుపత్రి, తిరుపతి రూయా ఆసుపత్రి, మరికొన్ని క్రైస్తవ చికిత్సాలయాలలో సంతాన నిరోధక వైద్య సదుపాయాలు లభిస్తున్నాయి. అన్ని ప్రాంతాల ప్రజలకూ అందుబాటులో వుండే విధంగా వైద్యాధికారులతో కూడిన సంచార బృందాలు పనిచేస్తున్నాయి. తత్ఫలితంగా 1969 ఆర్థిక సంవత్సరాంతానికి 11472 మంది మగ వారికీ, 7131 మంది మగువలకూ కుటుంబనియంత్రణ శస్త్ర చికిత్సలు చేయడం జరిగింది.

మొన్నటి మార్చి మాసాంతంతో ఆఖరయిన 1969–70 సంవత్సరం చిత్తూరు జిల్లా కుటుంబ నియంత్రణ చరిత్రలో నవ శకానికి నాంది పలికింది. ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విజ్ఞాన వికాస ఫలితంగా విశిష్ట జీవన సాధన వీలవుతుందనీ, అందుకు తమ కుటుంబాలను పరిమితం చేసుకోవాలనీ ప్రజలకు నచ్చజెప్పే వ్యవహారం వ్యయప్రయాసాలతో కూడింది. అక్షరజ్ఞానం గలవారి సంఖ్య అల్పంగా వుండడం, అధునాతన పద్ధతుల అనుసరణపట్ల విముఖత, అతి ప్రాచీన ఆచారాల ప్రభావాల మూలంగా జన సామాన్యంలో ఎన్నో భయాలు, అపోహలు అలుముకున్నాయి. వీటి నుంచి విముక్తి కలగజేసి, తమ కుటుంబాల పురోభివృద్ధికి నిరోధంగా తయారవుతున్న జనాభా పెరుగుదలను ప్రజలకు తేట తెల్లం చేయడంలో వివిధ విధానాలను వినియోగించిన విస్తరణ సిబ్బంది కృషి చాలావరకూ సఫలమయింది. బలవత్తరమూ, భయాందోళనా భరితమూ అయిన ఈ సమస్యకు సంబంధించిన సందేశం, సభలూ, సమావేశాలూ, సాహిత్యం పంపిణీ, చలన చిత్ర ప్రదర్శనలవంటి వాటి ద్వారా వైద్య ఆరోగ్యశాఖ సామూహిక విద్యావిభాగమూ, సమాచార పౌర సంబంధ, యాత్రికశాఖ జిల్లాలోని వీలైనన్ని ప్రాంతాలకు అందజేశాయి.

సంవత్సరారంభంలో అప్పటి జిల్లా కలెక్టరు శ్రీ ఎస్.ఎన్. ఆచంట అండదండలతో తిరుపతిలో ఒక సామూహిక మహిళల కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సా శిబిరం నిర్వహించబడింది. గర్భధారణం, శిశువులను కనడం అతివల జీవితంలో అతి ప్రధాన ఘట్టాలు. పునర్జన్మతో పోల్చబడే పురుడును వదిలించుకోవాలని మదిలో తలిచినప్పటికీ తరుణి సాధారణంగా శస్త్ర చికిత్స అంటే అమితంగా భయపడుతుంది. అయితే ఈ శిబిరంలో 2325 మంది ముందుకు రావడం అందరినీ ఆశ్చర్య చకితులను చేసింది. దానితో మూఢ విశ్వాసాల ముసుగు తొలగిపోయి, ముదితలు తమ సంసారాలను చక్కబరచుకోవడానికి కుటుంబ నియంత్రణ సదుపాయాలను సద్వినియోగం చేసుకోవడం ప్రారంభించారు. ఈ ప్రోత్సాహకర పరిస్థితులను అవకాశముగా తీసుకొని ఇటీవల ఉద్యోగ విరమణ చేసేవరకూ జిల్లావైద్య ఆరోగ్య శాఖాధికారిగా పనిచేసిన డాక్టరు టి. ఆంజనేయులునాయుడు, జిల్లాకుటుంబ నియంత్రణాధికారి డాక్టరు పి. యస్. మారుతిరాయలు చిత్తూరు ప్రభుత్వ కేంద్ర ఆసుపత్రి, మదనపల్లి ఆసుపత్రులలో సామూహిక స్థాయిలలోనూ, నగరి, శ్రీకాళహస్తి శిబిరాలను నిర్వహించి ఆయాప్రాంతాల అధికార అనధికార ప్రముఖుల సహాయముతో సత్ఫలితాలను సాధించారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో సంవత్సరం పొడవునా పురుషులకు శస్త్రచికిత్సలు చేయబడ్డాయి.





గత ఆర్థిక సంవత్సరం ఉత్తరార్థంలో చిత్తూరుజిల్లా కలెక్టరు శ్రీ బి. వి. రామారావు సంతాన నిరోధక కార్యకలాపాల పట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు వహించారు. కుటుంబ నియంత్రణకు యిక్కడ ఉత్తేజాన్నీ, ఉద్యమ స్వరూపాన్నీ కల్పించిన కీర్తి ప్రగతిశీలి, ప్రతిభాశాలి అయిన అయనకే దక్కింది. సాంవత్సరిక లక్ష్యంగా ప్రభుత్వం నిర్ణయించిన శస్త్ర చికిత్సలు 10,000 కాగా 14,500 సాధించబడ్డాయి. అంటే 45 శాతం అధికంగా ఆపరేషనులు జరిగాయన్నమాట. అంచనాలను అధిగమించి నూతన ప్రమాణాలు సృష్టించబడ్డ ఈ సంవత్సరంలో భిక్షకుల కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సా శిబిర నిర్వహణ ఒక విశేషం. జనాభా లెక్కల వివరాలను పరిశీలిస్తే బిచ్చగాళ్ళ మూలంగా ఎంతో సంతానాభివృద్ధి జరుగుతున్నట్లు తేలుతున్నది. కనుక వారిచేత కూడా పరిమిత కుటుంబ పథకం ఆచరింపచేయాలనే ఆశయంతో శివరాత్రి మహా పర్వదిన సందర్భంలో ప్రసిద్ధమైన శ్రీకాళహస్తి క్షేత్రంలో మూడు రోజులపాటు ముమ్మరంగా శస్త్రచికిత్సలు చేయబడ్డాయి. అఖిల భారత స్థాయిలో ద్వితీయస్థానం ఆక్రమించుకొన్న ఈ ప్రత్యేక తరహా శిబిరంలో 162 మంది యాచకులు ఆపరేషనులు చేయించుకున్నారు.

మతాల ప్రమేయమూ, రాజకీయాల ప్రసక్తీ లేకుండా సమాజ సంక్షేమానికి ఉద్దేశించబడ్డ ఈ ఉద్యమం చిత్తూరు జిల్లాలో అన్ని మతాల, వర్గాల ప్రజల ఆదరాభిమానాలు చూరగొంటున్నది. అయితే ఒక దశాబ్దం కాలంలో జననాల స్థాయిని వెయ్యి జనాభాకు 39 నుంచి 25కు తగ్గించడానికి తలపెట్టబడ్డ బృహత్కార్యక్రమంలో యింకా ఎన్నో ఘనవిజయాలను సాధించవలసివున్నది. గణనీయమైన కృషి ద్వారా గడించుకున్న ఉన్నత ప్రమాణాన్ని పరిరక్షించుకోవడమే కాకుండా ఈ జిల్లా రాగల సంవత్సరాలలో కుటుంబ నియంత్రణ కార్యక్రమం అమలులో ఆశ్చర్యకరమైన ఫలితాలను అందజేయగలదని ఆశించవచ్చు.

## ఇద్దరో ముగ్గురో చాలు

# చైతన్యమూర్తులు

## రఘుపతి వెంకటరత్నం

( జననం : అక్టోబరు 1. 1862 )

ఆయన నిరుపమానమైన వైదుష్యానికీ, నిరర్గళమైన వక్తృత్వానికీ, నీతి ప్రదమైన బోధనలకూ ఉప్పొంగి ఆయన చరణ సన్నిధిలో విద్య అభ్యసించడానికి మురిసిపోయిన అసంఖ్యాకులైన అంతేవాసులకు కులపతి రఘుపతి.

సంఘ దురాచార ఖండనానికి శస్త్రధారియైన వీరేశలింగానికి అండయై నిలిచి ఆయనవలెనే

తన దేహము తనగేహము
తన కాలము తన ధనంబు తనవిద్య జగ
జ్జనులకే వినియోగించిన

వితరణశాలి వెంకటరత్నం.

బందరు మ్యునిసిపాలిటీలో కౌన్సిలరుగా ఉండినప్పుడు పన్నులవిధింపు సందర్భంలో దర్శింపవెళ్ళిన ఒక యింటిలోని వేశ్య కష్టగాథను విని ఆమె కన్నీటి చుక్కలనుచూచి సంఘం స్త్రీకి చేస్తున్న అవమతినీ, అపచారాన్నీ సహింపలేక పతితస్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకొన్న కరుణామూర్తి నాయుడుగారు ఆయన మేజువాణీలను అరికట్టడానికి కృషి చేసి ఎందరో స్త్రీలను పడుపువృత్తినుంచి మరలించి సంసారధర్మంలో ప్రవేశపెట్టిన సంఘ సంస్కర్త.

ఆకలికి అస్థిపంజరాలై ఆ అస్థులను కప్పుకోడానికి కూడా గుడ్డముక్కలు లేక దిక్కుమాలి దీనాలాపం చేస్తున ఎనిమిదేళ్ళ లోపు వయస్సుగల నలుగురు హరిజన బాలికలను పొన్నేరి రైలు స్టేషనులోచూచి హృదయం ద్రవించి వారిని తన కడుపులోనికి తీసుకొనేవరకు దుర్దాంత వేదనపొందిన దీన జన బాంధవుడు ఆయన. వారికి పెద్ద చదువులు చెప్పించి బ్రాహ్మణయువకులకు ఇచ్చి వివాహం చేసిన 'నాయన' ఆయన. హరిజనోద్యమానికి మార్గంచూపిన మాన్యుడు.

ఐదేళ్ళపాటి స్వల్పకాలం సంసార సుఖం అనుభవించి 27 ఏళ్ళ చిన్న ప్రాయంలోనే అర్ధాంగిని కోలుపోయి మళ్ళీ వివాహం చేసుకోడానికి నిరాకరించి ఏక పత్నీ వ్రతుడై నిష్కళంక జీవనం గడపిన బ్రహ్మర్షి ఆయన. ఆయనకు కడుపున పుట్టిన ఒక్కతే కుమార్తె. ఐతే నేమి తన సహాయంపొందిన అనేక అనాథులు, అభాగ్యులు, వితంతువులు, విద్యార్థులు, దరిద్రులు, దీనులు అందరూ ఆయన బిడ్డలయ్యారు.

ఆయన విద్వాంసుడు; విద్యావేత్త; సంస్కర్త; సహృదయుడు; వక్త; వదాన్యుడు; ఉపాధ్యాయుడు; ఉపదేశకుడు; కులపతి; గుణనిధి: నిరాడంబరుడు; నిస్స్వార్థజీవి. ఆయనది పరుష మెరుగని జిహ్వ: ఔద్ధత్యం ఎరగని ఔన్నత్యం. అనాథులలో విశ్వనాథ దర్శనం చేసిన అనుకంపాశాలి ఆయన. పతితోద్ధరణలో పరమేశ్వర సాక్షాత్కారం పొందిన పరమపురుషుడాయన.

## డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

(జననం: అక్టోబరు 12,1891)

తెలుగు సారస్వత మందిరంలో తొలిదివ్వెలు వెలిగించినది తూర్పు గోదావరి మండలం. అంధకార మయమైన అస్వతంత్ర యుగంలో ఆ జిల్లాను ప్రబుద్ధంచేసిన ప్రముఖ నాయకులు ఇద్దరు. కాకినాడలో బులుసు సాంబమూర్తి; రాజమహేంద్ర వరంలో బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం. శాసనోల్లంఘన కార్యక్రమంలో, సత్యాగ్రహోద్యమంలో ఎంత సాహసాన్ని ప్రదర్శించిందో ఆ జిల్లా నిర్మాణ కార్యక్రమంలో కూడా అంతటి అభినివేశాన్ని కనబరిచింది. ఆ నిర్మాణ కార్యక్రమాన్ని అమోఘంగా నిర్వహించిన నాయకుడు డాక్టర్ సుబ్రహ్మణ్యం.

ఆయన చదివినది కలకత్తా జాతీయ వైద్య కళాశాలలో, వంగదేశ వాతావరణం ఆయన రక్తాన్ని ఉప్పొంగజేసింది. ఆయన అభ్యసించిన వైద్య విద్య ఆయన సేవాసక్తికి మరింత దోహదం చేసింది.

ఆయన రాజమహేంద్రవరంలో వైద్యవృత్తిని ప్రారంభించాడు. హోమ్‌రూల్ ఉద్యమంలో ఆయన దేశభక్తి దీప్తిమంతమయింది. 1920 నాటి సహాయ నిరాకరణోద్యమం ఆయనను ఆకర్షించింది. 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభ సందర్భంలో ఆయన అత్యంతోత్సాహంతో పనిచేశాడు.

తన యావత్కాలాన్నీ, యావచ్ఛక్తినీ దేశసేవ కోసం వినియోగించాలని నిశ్చయించుకొని నెలకు వెయ్యి రూపాయల ఆదాయం వచ్చే వృత్తిని విసర్జించాడు. తిలక్ స్వరాజ్యనిధికి లక్షలు పోగుచేసి ఇచ్చాడు.

శాసన సభలనూ, బిరుదులనూ, విదేశీయ విద్యాలయాలనూ, కోర్టులనూ, విదేశీ వస్త్రాలనూ బహిష్కరిస్తూ గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినప్పుడు ఆ ఉద్యమ వ్యాప్తికి అఖండమైన కృషిచేశాడు సుబ్రహ్మణ్యం.

శాసన సభా ప్రవేశ సమస్య వివాదగ్రస్తమైన రోజులలో సుబ్రహ్మణ్యం శాసన సభా బహిష్కరణోద్యమానికి ఉభయ గోదావరి జిల్లాలలోనూ నాయకత్వం వహించాడు. శాసన సభలలో ప్రవేశించి బ్రిటిషువారితో సహకరిస్తూ వారి హృదయంలో పరివర్తనం తెచ్చి స్వాతంత్ర్యం సంపాదింపవచ్చుననే సిద్ధాంతం ఆయనకు నచ్చలేదు. అంతకంటె దేశప్రగతికి నిర్మాణ కార్యక్రమం చేపట్టడం శ్రేష్ఠమని ఆయన దృఢవిశ్వాసం. నిర్మాణ

కార్యక్రమాన్ని సుబ్రహ్మణ్యంవలె చిత్తశుద్ధితో చేపట్టి నిర్వహించిన వారు దేశం మొత్తంమీద చాలా తక్కువమంది అని చెప్పాలి.

నిర్మాణ కార్యక్రమ నిర్వహణకు ఆయన రాజమహేంద్రవరం సమీపంలోని సీతానగరంలో గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించాడు.

ఆరోజులలో రాజమహేంద్రవరంలో ముస్తాఫాఅలీ ఖాన్ పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటుగా ఉండేవాడు. అతడు అవలంబించిన హింసావిధానం భారతదేశం మొత్తం మీదనే అద్వితీయ మని చెప్పవచ్చును.

అతని దానవ చర్యలకు సీతానగర ఆశ్రమం ధ్వంసమయింది. రాజమహేంద్రవరం రాజవీధులలో 1932 జనవరి 26వ తేదీని సుబ్రహ్మణ్యంపై జరిగిన పోలీసు అత్యాచారం వర్ణించడానికి మాటలు చాలవు. దారుణం, ఘోరం, భయంకరం ఇలాంటి మాటలు చాలా పేలవమైనవి. సుబ్రహ్మణ్యం ఎముకలు విరిగిపోయాయి. మాంసం చలిమిడి ముద్దైపోయింది. ప్రాణం పోలేదు కాని శరీరం చచ్చిపోయింది.

దానితో డాక్టర్ సుబ్రహ్మణ్యానికి క్షయవ్యాధి అంకురించింది. ఆ వ్యాధితో నాలుగేళ్లు తీసుకొని ఆ దేశభక్తుడు, ఆ స్వార్థత్యాగి 1936 డిసెంబరు 23వ తేదీని శిథిలమైన శరీరాన్ని విడిచిపెట్టాడు.

## చిలుకూరి వీరభద్రరావు

( జననం : అక్టోబరు 17, 1872 )

మనం ధారాళంగా ఉపయోగించే 'హిస్టరీ' అనే ఆంగ్లపదం 'హిస్టరియ' అనే గ్రీకు శబ్దం నుంచి ఉత్పన్నమైనది. 'హిస్టరియ' అంటే విచారణ, విమర్శనల ఫలితంగా విదితమయ్యే విషయం అని అర్థం. గతంలో జరిగిన సంఘటనలను వ్రాసిపెట్టినంత మాత్రంచేత అది హిస్టరీ అనిపించుకోదు. జరిగిన సంఘటనల వివరాలను పరీక్షించి, వ్యాకరించి, సార్థంగా విశదపరచడమే హిస్టరీ యొక్క లక్ష్యం. ఈ దృష్టితోనే పాశ్చాత్య విద్వాంసులు హిస్టరీ వ్రాస్తున్నారు.

మనం చరిత్ర అంటున్నాం. చరిత్ర అంటే నడవడి అనీ వృత్తాంతం అనీ అర్థం. ఇతిహాసం అనే శబ్దంకూడా ఉపయోగిస్తున్నాం. ఇతిహాసం అంటే ప్రాచీనగాథ అన్నమాట. మహాభారత రామాయణాదులలోనూ, పురాణాలలోనూ ప్రాచీనగాథలు ఉన్నాయి. ప్రాచీన కాలంలో జరిగిన సంఘటనలు జరిగినవి జరిగినట్లుగా కాలక్రమానుగతంగా ఈ గ్రంథాలలో వర్ణింపబడలేదని మనం ఒప్పుకోక తప్పదు.

భారతదేశానికి సంబంధించి చరిత్ర అని చెప్పుకోదగినది— ఇప్పుడు మనకు లభ్యంగాఉన్న అత్యంత ప్రాచీనమైనది— కల్హణుని 'రాజతరంగిణి'. ఇది 12వ శతాబ్దినాటిది. అదికూడా కాశ్మీరరాజుల చరిత్ర మాత్రమే. యావద్భారత దేశచరిత్ర కాదు.

ఇక తెలుగుదేశానికి సంబంధించినంతవరకూ హిస్టరీ అని చెప్పుకోదగిన చరిత్ర వ్రాయడానికి ప్రయత్నం వర్తమాన శతాబ్ది ఆరంభంనుండే జరిగింది. అలాంటి కృషికి బాట వేసిన వారిలో చిలుకూరి వీరభద్రరావు ఒకరు.

సాంప్రదాయికంగా వస్తున్న కట్టుకథలు, గాథల ఆధారంగా చరిత్ర వ్రాయడం అసాధ్యం, చరిత్రను పునర్నిర్మించాలంటే చాలా సాధనసామగ్రి కావాలి. పురావస్తుశాస్త్రం(ఆర్కియాలజీ), శాసన పరిశీలనం (ఎపిగ్రఫి) నాణెం శాస్త్రం (న్యూమిస్మాటిక్స్) మొదలైన అనేక రంగాలలో విశేష పరిశోధన చేయవలసి ఉంటుంది. అది అధిక వ్యయప్రయాసలతో కూడిన పని. వ్యక్తులకు తలకు మించినపని.

ఇలాంటి పరిస్థితులలో ఆ మహనీయుడు వేదనపడ్డాడు. ఆంగ్లవిద్యాధికులు ఎందరో ఉన్నారు. వారిలో చాలా కొద్దిమంది మాత్రమే స్వభాషాభిమానం కలిగి సేవచేస్తున్నారు. వారు కూడా చరిత్ర విషయంలో ఎక్కువగా కృషిచేయడంలేదు. దేశం చరిత్రవిహీనమై ఉండడం శోచనీయం అని వేదనచెంది ఆయన తనశక్తికొలదీ పరిశ్రమా పరిశోధనాచేసి చారిత్రికాధారాలను సేకరించి లభ్యమైనవాటిలో విశ్వసనీయాలుగా తోచిన వాటిని స్వీకరించి చారిత్రికాంశాలను సమన్వయపరచి, కాలక్రమానుసారమైన ఆంధ్రుల చరిత్రను వ్రాయడానికి పూనుకొని, దేశానికి మహోపకారంచేసి ఆంధ్రచరిత్ర చతురాననుడని ప్రశంసపొందాడు. చారిత్రిక రచనలలో ఆసక్తిని కలిగించడానికి ఆయన మహాపురుషుల జీవితాలనూ, చారిత్రిక నవలలనూకూడా రచించాడు.

తన కుండిన పరిమిత సాధనసంపత్తితో ఆయన చేసిన కృషి అనల్పమైనదే. ఇంకా చేయవలసిన కృషి చాలా ఎక్కువగానే ఉంది. సమగ్రమైన ప్రామాణికమైన, చరిత్ర తెలుగు దేశానికి లభించే సుదినం ఇంకా ఎంతదూరంలో ఉందో మరి.

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

( జననం : అక్టోబరు 29, 1866 )

అయిదేండ్లపుడె వారి అయగారు కథలెన్నొ
నుడివి లోకజ్ఞాన మిడినకడిమి
ఆబాల్యముగ నన్నయాది భారతమును
విని చదివిన దాన వెలయు ఫలము
అనవరతము లోన ఆంధ్ర నైషధ కర్త
కవితామహత్త్వమ్ము కనెడు గురుల

విడక బాలాదేవినెట నాల్క నిడుకొని
ధ్యానించుచుండెడి దాని మహిమ
కారణం బయి ప్రోత్సాహకరము లగుట
నూటయేబది గ్రంథముల్ మేటు లెన్న
సలిపి కవి సార్వభౌముడై చనుట కాక
కృష్ణ డాస్థానకవి యయి జిష్ణుడయ్యె.

అని చెప్పుకొన్న కృష్ణుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి పీఠాన్ని అలంకరించిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

మరి ఆనూట ఏభై పుస్తకాలూ చిన్నవీ చితుకులూకావు. లక్షశ్లోకాల మహాభారతం, 24 వేల శ్లోకాల రామాయణం, 18వేల శ్లోకాల భాగవతానికి చేసిన అనువాదాలు కాక, కావ్యాలు, నవలలు, నాటకాలు, శతకాలు, అష్టకాలు, మాహాత్మ్యాలు ఇంకా ఎన్నో గ్రంథాలు కృష్ణమూర్తి శాస్త్రి ప్రణీతాలు.

గౌతమి అనే దినపత్రికనూ, కలభాషిణి, మానవసేవ, వందేమాతరం, వజ్రాయుధం వంటి ఇతర పత్రికలను కూడా శాస్త్రి ప్రచురించాడు.

ఆయన పదహారేళ్ల నూనూగుమీసాల లేప్రాయంలోనే శ్రౌతస్మార్తాలలో పాండిత్యం సంపాదించి యజ్ఞాలలో ఆధ్వర్యం నిర్వహించాడు.

ఆయన వైదుష్యానికీ, ప్రతిభా ప్రాభవానికీ ఆనవాలుగా ఆయనకు లభించిన బిరుదులు—కవిరాజ, కవిసార్వభౌమ, ఆంధ్ర వ్యాస, అభినవ శ్రీనాథ, వేదవిద్యా విశారద, కళాప్రపూర్ణ, మహా మహోపాధ్యాయ ఇత్యాదులు.

ఆయనకు జరిగిన సన్మానాలు అనేకం. గండపెండేరం, స్వర్ణాభిషేకం, గజారోహణోత్సవం, విగ్రహప్రతిష్ఠ — ఇత్యాదులు.

పాలు నీరువోలె వారును వీరును
కలసి మెలసి దేశ గౌరవంబు
నిలువ బెట్టుకొనుచు నిమ్మకు నీ ర్వోసి
నగతి రాష్ట్రపాలనము

జంటగాలనీ, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలవారు ఐకమత్యంతో అలరారాలనీ కాంక్షించి కన్నుమూసిన కవి సార్వభౌముడు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

—జి. కళ్యాణసింగు

---

# చంద్రున కొక నూలుపోగు

తేనియ సోనలై విరుల
తీపులునై యమృతాలయూటలై
వీణియ పాటలై మధుర
పీచికలై రుచిరార్థ భావనా
వేణికలై రసార్ద్ర పదవీ
సుగుణాంచిత తోరణమ్ములై
మానవరూపమెత్తిన రమాపతి
బాపుజిపలుకులొప్పెడిన్

సత్యదేవతా చరణాబ్జ చంచరీక
మతుల హింసారహిత విప్లవాత్మకమ్ము
ఆత్మతేజః ప్రదీప్త మహామహమ్ము
హిమగిరి సమమ్ము గాంధిజీ విమలయశము,

అతనిజాడలు జాతి జీవితమునందు
చెరగనేరని ముద్రతో చెన్నుమీరె
అతని జీవనసరణి ప్రహర్ష ఫణితి
భారతీయుల వారసత్వమ్ముగాగ.

బోసినవ్వులతోన పులకించె విశ్వమ్ము
కాంతివర్షము మేన గదిరినట్లు
'దండి' సత్యాగ్రహ ధగధగ ధ్వగలలో
జాతీయతారేఖ సంతరిల్లె
పదపదమ్మున రామభక్తి పుంజుకొనంగ
జాతి గుండియ క్రొత్త జవము నొందె
ప్రేమభావన జనప్రియత పొంగులువార
తళుకొత్తె నూత్నవేదముల దీప్తి

తనువుగొన్న యహింసావిధాన మట్లు
సత్యమే మేనుదాల్చిన సరణి - సతము
మూర్తిమంతమై విలసిల్లె కీర్తి సాంద్రు
డైన బాపుజీ ; దేశహితైకపరత.

—పోచిరాజు శేషగిరిరావు

# గాంధీ చరిత్ర - తోలుబొమ్మలాట

(గత సంచిక తరువాయి)

— ఆరుద్ర

దక్షిణాఫ్రికాలో బాలసుందరం గాంధీజీని కలుసుకుని
తమ ఇబ్బందులను చెప్పుకొనెను.

ద్విపద :

గాంధీ
అనుచు దీనమ్ముగా నరించువాని
నను నయించెను గాంధి యాత్ర యొచ్చి
నీకింక భయమేల నేనుంటినోయి
మనవారి స్థితిగతుల్ మరుగడతీరు
బాధల్ జెప్పు మా బాలసుందరున
యని గాంధి ప్రశ్నింప యాతడిట్లనియె.

బాలసుందరం : ద్విపద :

వినవయ్య వినవయ్య విమల చరిత్ర !
ఆఫ్రికా ఖండమందాంగ్లేయ ప్రభుత
పాలనమ్మున తీవ్రబాధానలమున
మనవారు పలువురు మ్రగ్గుచున్నయ్య
వణిజు ఉద్యోగులు పరుగైనవారు
వివిధ వృత్తులవారు పెక్కండ్రు గలరు
అరవ లాంధ్రులు మరి ఔత్తరాహులును
ముస్లిముల్ పార్సీలు మొదలైనవారు
కాయ కష్టమ్ము జేయు కార్మికుల్ గలరు.
రెక్కాడినన్‌గాని డొక్కాడనట్టి
దినకూలి గతియగు దీనులు గలరు
కూలివారల సంఖ్యగొప్పదౌ కతన
మనకు కూలిమాట మారు పేరయ్యె
దాక్షిణాత్యులయందు స్వామియన్ పేరు
సర్వసామాన్యమౌ సాకిరి వలన
సర్వ హైందవులను సామి గణించుచు
శ్వేతవర్ణులు సదాపిలిచెదరయ్య
భారతీయుల నిట పరయాలవోలె
బానిసల్ చందాన బ్రతుకుతున్నాము
వెలివాడలందు జీవించంగవలయు
తొలిజాము దాటిన వెలివాడదాటి
రాత్రివేళ మనము రహదారులందు
కాలుమోపగరాదు కనిపించరాదు
శ్వేతవర్ణులుచేరి జీవించుచోట
భారతీయుల నీడ పడనీయరాదు
మాన్యాలు భవనాలు మరివేటినైన
శ్వేత వాడలలోన చేర్చంగరాదు
మలిన కూపములందు మ్రగ్గుచున్నాము
ప్రత్యక్ష నరకాన బ్రతుకుచున్నాము.

సంధి వచనం : అని బాలసుందరం లక్షోపలక్షల దైన్య స్థితిని
చెప్పగా గాంధీజీ ఏమనినన్న :

గాంధి : ద్విపద :

పెక్కు వాక్యములేల వివరమ్ములేల
భారత దేశాన పంచములెట్లు
జాత్యహంకారాగ్ని సమిధలైనారు.
అరీతిగానిట ఆఫ్రికాలోన
భారతీయులు ఘోరబాధలకోర్చి
జీవచ్ఛవాలట్లు జీవించుచుండ్రి
నిండుగా మెండుగా నీతిగా నుండి
హాయిగా జీవించు హక్కు సర్వులకు
సమమని దైవమ్ము చాటియున్నాడు.
ఆ వాక్యమే మన మనుసరించుటకు
కలిసికట్టుగలేచి కదన మొనర్చ
ధర్మపథమునసాగు దండు కావలెను
సత్యాగ్రహమ్మను శస్త్రమ్ముదీసి
సమర మొనర్చగా శత్రువు కరుగు
తెల్లవారలెకాదు దేవుడే వచ్చి
మన హక్కు మనకిచ్చి మనల దీవించు
రండు సోదరులారా రండయ్య రండు
పౌర హక్కులకోరి పోరంగ రండు !

శంఖనాదం : పాట :

శంఖనాదం మ్రోగినది
శంకలన్నియు పోయినవి
విరిఢంకా మ్రోగినది
విజయ పతాకం ఎగిరినది

కనివిని యెరుగని కదనము సాగెను
కష్టజీవుల వదనము మారెను
కరుడు కట్టిన శత్రు హృదయమే
కరిగి వరదలై సరగున పారెను

జయహో - జయహో - గాంధీ!

[ బొమ్మలు తెరలు దిగుతాయి ]

(బంగారక్క, కేతిగాడు, బోలిగాడు వస్తారు.)

కేతిగాడు : అహహ - విన్నావా అత్తా! ఆఫ్రికాలో గాంధీగారు ఎంతటి విజయం సాధించారో!

బంగారు : విన్నానురా కేతిగా!

కేతిగాడు : చూశావా అత్తా! గాంధీగారు ఆఫ్రికాలో ఏం చేశారో!

బంగారక్క : అవతార పురుషుడేం చేసినా చేయగలడు

బోలిగాడు : ఓరి కేతిగా - నల్లాళ్ళని అక్కడ తెల్లాళ్ళు మాలాళ్ళలాగ చూస్తే మరి మాలాళ్ళను మన వాళ్లు ఎలా చూశారంటావు?

కేతిగాడు : ఎవరెలా చూసినా గాంధీగారు మాత్రం వాళ్ళని తన యింట్లో వాళ్ళ లాగా చూసుకున్నారు. ఆఫ్రికాలో ఆయన ప్లీడరుగిరి చేసినప్పుడు ఆయన గుమాస్తా ఒకడు మాలకిరస్తానీ. ఆ గుమాస్తా గాంధి గారింట్లోనే తిండి తినేవాడు. పడుక్కొనేవాడు. కాలకృత్యాలు తీర్చుకునేవాడు. తెలుసా!

బోలిగాడు : మాలాళ్ళను కలుపుకొన్నందుకు లోకం అయన్ని వెలి వేయలేదా :

బంగారక్క : లోకాన్నే ఆయన వెలివేస్తాడు. ఏమిరా కేతిగా?

కేతిగాడు : బాగా చెప్పావు ఆఫ్రికాలో అటువంటిది జరుగలేదు గాని గాంధి గారు మన దేశానికి వచ్చాక అటువంటిది జరిగింది. ఆయన అహమ్మదాబాదులో ఆశ్రమం కట్టుకున్నారు. సీమబట్టలు మానేసి మన దేశవాళీ బట్టలు కట్టుకునేవారు. అందరూ ఆశ్రమంలో ఏ ఆడంబరం లేకుండా వారు ఉండేవారు గాంధిగారు తమతో మాలవాళ్ళనుకూడ చేర్చుకుంటామంటారు. ఒక కుటుంబం వచ్చి ఆశ్రమంలో చేరబోయారు అప్పుడేమయ్యిందంటే.

బంగారక్క : ఏమైంది?

కేతిగాడు : వినబోతూ రుచి అడుగుతా వెందుకు-చూడు.

దేశసేవకొరకు దివ్యాశయముల
చేపట్టి కడు దృఢ చిత్తమ్ముతోడ
సహమదాబాదున నాశ్రమమ్మొకటి
నిర్మాణ మొనరించి నియతితో నడుప
పంచము డొక్కడా పంచను జేర
నేతెంచి గాంధితో నిటు విన్నవించె

[ దూద్‌భాయి బొమ్మ తెరమీదకు వస్తుంది. ]

(అతని వెనక దనీబెహన్, లక్ష్మి బొమ్మలు కూడా వస్తాయి.)

దూద్‌భాయి : దరువు!

శరణు! శరణు! వినుగంటి - మహాత్మా
చరణమ్ములే శరణమంటి

దూదబాయి నాదుపేరు-నీ
ఆదరమే మదికోరు

దానీబెహన్ నాదు భార్య-అది
పూనిచేయును పరిచర్య

చిన్నారి లక్ష్మి నా బిడ్డ-ఇది
కన్నుల కపురంపుబెడ్డ.

దక్కనుబాబా వంటి అహ
పెక్కంద్ర మెప్పులగొంటి

ఉందయ్య కడుకొంది చదువు-నీ
పొందుచే యది పాడిమెదవు ॥శ॥

ద్విపద : ఆశ్రయమ్మునుగోరు నాతని జూచి
వాత్సల్యమున గాంధి వచియించెనిట్లు

గాంధి : పద్యం :

స్వాగతము స్నేహశీలుడ
స్వాగతమో పుణ్యమూర్తి స్వాగతమయ్యా
ఓ గుణవంతుడ మాతో
భాగస్వామిగా మనంగా స్వాగతమయ్యా.

స్కంధివచనం : అనుచు నాశ్రయమిచ్చియనపుడు గాంధి కస్తూరిబాయికి కట్టడజేసె.

గాంధి : ద్విపద

కాంతిరో భార్యరో కస్తూరిబాయి
ఆశయాలకు వచ్చె నగ్ని పరీక్ష!
సర్వమానవులిల సములన్నసూక్తి
నాచరించగ మంచి యవకాశమొదవె!
దూదబాయిని నీదు తోబుట్టువట్లు
చూచుకో వలయునో సుదతిరో సతము.

దానీబెహను నీకు తాబాసటౌను
చిన్నారి లక్ష్మి యా కన్నుల విందు

పంచముల్ కారు ప్రపంచమున వీరు
మాలలా కారు సుమాలలేగాని

సంధివచనం : అనుచు నాజ్ఞాపించు నాత్మేశు జూచి
కొంత చాటుకు బిల్చి కాంత యిట్లనియె

కస్తూరిబా : దరువు :
ఏమయ్యా ఏమయ్యా నాథా !
ఇది యేమి సరిక్రొత్త బాధా ?
ఇందుకె నను ఆలోచించక అయ్యయ్యో
పంచముల మన పంచను జేర్చంగ
ఎంచరాని వెతలు ముంచుకొచ్చును ఈ
మంచి యాశ్రమ లతను త్రుంచి వేయకుమయ్యా॥ఏ॥

సందివచనం : అనిచెప్పగా గాంధి ఆలించకున్న
వ్యాకుల చిత్తయై వనిత నిట్లనియె.

కస్తూరి : పరుల చందాలపై బ్రతికెడుసంస్థ
జనవాక్యమును బట్టి చరియించవలదె
కడజాతి వారు అక్కడ చేరియున్న
యగ్రవర్గము వారాగ్రహించెదరు.
చిరుసహాయముకోరి చేయి చాపంగ
చిల్లి గవ్వనుకూడ చెల్లింపరయ్యా
ధనము సంగతికేమి ధార్మిక పరులు
వెలివేసి మనలను వేధింతురయ్యా
సౌకర్యముల నాపి సాధింతురయ్యా
రాచబాటకు నిన్ను రానీయరయ్యా
నీరుతోడగ నీరు నూరబావులను
నీళ్లు పుట్టవి జన్మ నీచపుజన్మ

సంధివచనం : అనిబాల వాపోవు యతివను గాంచి
గాంధీజీ యిట్లు విస్పష్టగా వచించె.

గాంధీజీ : దేవుడిచ్చిన నీళ్లు దేవునిగుళ్లు
తోటిమానవులకు దూరముజేయు.
ఎంత టన్యాయమ్మొ యెరుగవె లలన
పంచముల్ సైతము పరమాత్మ సుతులె
వారి కాశ్రయము నివారించరాదు
పరమ ఛాందసులకు భయపడరాదు.
వెలివేయనిమ్ము నన్ వేధించనిమ్ము
విమలా శయమ్ముల విడువను సుమ్ము
వెలికి నీ భయమొంది వేరొక్కనగరు
వలసపోవుట కల్ల, వణుకుట కల్ల
ఆశ్రమ సభ్యుల మందర మతివ
మాలవాడకు పోయి మనగల మచట
ఎన్నడో రాగల ఈతి బాధలకు
నీ నాడె వెరచుట యింగితమగునె
రానిమ్ము యెటువంటి రాయిడియైన
దూదబాయి గృహమ్ము తొయ్యలి యిదియె

చేదోడు వాదోడు చెలిగతై యగును
వంటలోపల సాయపడు దాసీ బెహను
కాంత నా యానతి కాదనరాదు

కస్తూరి : అని యానతీయగా నాయమ వగచి
ప్రాణ నాథునితోడ పల్కె తానిట్లు

కస్తూరిబా : మేలు మేలు బెబాపు మితిమీరుమయ్యా
నానాటికి నీవు నన్ను వేధించ
కడు గడు మార్గముల్ కవిపెట్టుమయ్యా
వదనల్ నాకు నవీనమ్మ గావు
అలనాడు కటకటా యాఫ్రికాలోన
కాపురమ్మును పెట్ట కరుణే మిలేక
మాల మాదిగలను మనయింట జేర్చి
చేయించినావు నాచేత యీ నాడు
వారికి నిత్యమ్ము పని యూడిగముల
అంతతో నాగక నాచేత స్వామి
మాల గుమాస్తాల మల మూత్రములను
నా చేత యెత్తించినావు నిర్దయుడ :
నాకు తప్పదు కద నాథుని యాజ్ఞ
విధిలేక యద్ది నెరవేర్చితి నను
కోపించి యిలు వీడ కొట్టగ లేదె
నాడంత చేసిన వాడవు నీవు
నేడింత చేయకు నీ కేమి కొరత
మాలకూ డీ నాడు మా నోటగ్రుక్క
సంకల్ప మొదవెనా సరియె కానిమ్ము !

సంధివచనం : ఇటు రోధించెడు యింతి ముఖమ్ము
పరికించి గాంధీజీ పక్కున నవ్వె

గాంధీజీ : నాటిసంగతు లెల్లనాతిరో దలచి
పరితాప మొందుట భావ్యమా నీకు
అలనాడు గురువునై యలఘు పాఠముల
నేర్పినాడను నాడు నేర్చినదెల్ల
నేడు మరచుటవిసీతియా ? పత్నీ !
కాంత నీపై నాకు కరుణ లేదనకు
నాదు చైదములన్ని సాదర కృతులె
బడి యొజ్జ దండించ బాధించుటౌనె
గురుడు తిట్టిన యది కోపించుటౌనె
మల మూత్రముల్ యెత్త మాతృధర్మమ్మొ
సహజ కృత్యము జేయతాన సిగ్గేల
నీ దుసంతతి పట్ల నెరవేర్చునట్టి
కృత్యము లితరుల కొరకు జేయంగ
దోషమా ? దుర్భర దురితమా ? నెలత !
తండ్రిగా నన్నెంచి దరికొను వారి
తల్లినై చల్లని దయ జూపవలదె ;
సహధర్మచారిణీ సర్వకార్యముల
నీ బాసటల్ నాకు నిత్యమ్మువలయు
పంచములని కదా పడతిరో దలచి
వీరిమైత్రిని జేయ వెరతువునీవు

నేను పంచముడనై నిజముగా మెలగ
పంక్తి బాహ్యునిజేయ వలతువా నన్ను
ఈ క్షణమ్మాదిగా ఇది నా ప్రతిజ్ఞ
చిన్నారి పొన్నారి చిట్టి ఈ లక్ష్మి

పంచమ కన్యకన్ పెంచుకున్నార
వీరు నా బంధువుల్ వీరు నీ వారు
తనవారి కీ యింట తానములేదె
భర్త పంచముడైన భార్య యేమగును.
అంతరాత్మను గుచ్చి యడుగుమో వనిత !

సంధి వచనం : అని భర్త ప్రశ్నించ నాశ్చర్యమొంది
పడతి కస్తూరిబాయి పలికె తానిట్లు

పాట

జోహారు ! జోహారు ! అను నిత్యము
ఊహాతీతము నీకృత్యము
నీ మాట నా పూల బాట
నీ మమత పెట్టని కోట
నీమమో దురితమో విరయమో స్వర్గమో
నీ పలుకె నాకింక నీతి శాస్త్రపుపొరట ॥జో॥
భేదభావము విడుతునయ్యా !
సాదరమ్ముగ విడుతునయ్యా !
నీ ధర్మపత్నినై నిత్యమ్ము నీడనై
నీ దారిలో నేను నిజముసాగుదునయ్యా ! ॥ జో ॥
తెరపడును. (సశేషం)

# గాంధీస్మృతి

సోమంచి సూర్యనారాయణశర్మ

సంతత నిజదేశ జననీ పదాబ్జ సం
సేవాత్తమతి కొండు దైవమేల ?
నిరత దీనావళీ గురుపరిరక్షణా
యతచిత్తునకు వేతె, యాత్రలేల ?
సమధికానంద ప్రసన్న మనః ప్రభా
భాసితునకు నింక స్వర్గమేల ?
విమల సత్య వ్రతా సమ శౌచదీక్షిత
నుతశీలునకు నన్యవ్రతములేల ?

నీదు నుడి విన్న, వేరొండు వేదమేల ?
కాదనుటలేల ? వ్యర్థ వివాదమేల ?
శాంతి సీమంతి నీ భోగి ! సత్యయోగి !
ప్రేమ సంభరితాత్మ ! గాంధీమహాత్మ !

నిలబడి గట్టిగా పలుక నేరవుగాని,
వేల దేశాల విన్పింపగలవు;
పూచిక పుల్లయేన్, బూన నేరవుగాని,
మర ఫిరంగులకు మార్మలయగలవు
సంచిలో నొకకాని యుంచుకొనవుకాని,
మించి కోటులనె వర్షించగలవు
బెత్తెడుమేర బర్వెత్త నేరవుగాని,
అరిని వేయోజనాల్దఱుమగలవు

నీవు సాధింప లేనిదీ నేల, నేది ?
జయ ! మకుటశూన్య భారత చక్రవర్తి !
జయసుజన చిత్తవర్తి ! ఆశాంత కీర్తి !
ప్రేమ సంభరితాత్మ ! గాంధీమహాత్మ !

సూర్యకాంతి రవంత సోకనీయని కాంత
నెండ కొండనక త్రిప్పించినావు
పైడి యుయ్యేల దూగాడు శ్రీమంతుల,
జెయిల బండల బండజేసినావు
పాయసాన్నముల గమాయించు భోగుల,
కంచెడంబలినె త్రావించినావు
చీని చీనాంబరాలూను సంపన్నుల,
ముదుక కద్దరులోన ముంచినావు

చెప్పినంతయు మున్నీవు చేసినావు
మించి యన్యులచేత జేయించినావు
బళిర నీ శిక్ష ! మహిత సద్భావదీక్ష !
ప్రేమ సంభరితాత్మ ! గాంధీమహాత్మ !




## బాల రసాల నవపల్లవ కోమల కావ్యకన్యకలు బాపురెడ్డి రచనలు

"నా ప్రత్యేకత నిత్యనూతనత , వీ
ణా వేణు సంగీత రా
గ ప్రత్యూషము నా నివాసము, నిస
ర్గ స్వాదు సౌందర్య భా
వ ప్రక్షేపము నా విలాసము, జగత్
స్వప్న ప్రబుద్ధాంతరి
క్ష ప్రస్థానము నా మహాశయము, న
క్షత్రాలు నా కావ్యముల్"

బాపురెడ్డి పద్య కావ్య రచనా ప్రస్థానాన్ని ప్రారంభించిన పద్యం ఇది. పద్యాన్ని పందెపు గుర్రంలా నడిపించడంలో ఆయనకు ఆయనే సాటి.

"నక్షత్రాలు నా కావ్యముల్" అని అనడంలో బాపురెడ్డి చేసిన ఊహ లోకకల్యాణ దోహనదోహలం. రసజ్ఞులు, సౌందర్యాన్వేషకులు అయిన సహృదయులకు, భావాంతరాళాలలో నిత్య విహారాలు జరిపే స్వాప్నికులకు తన కావ్యాలు శుభంకరాలై, రసానందపారమ్యానికి దారి చూపుతాయని ఆయన నిర్దేశిస్తున్నాడు. ఇవి దుష్టగ్రహాలు కాదు, స్నేహతారలు అంటున్నాడు.

"బాపురెడ్డి పద్యకావ్యాలు" సంపుటిలోని మొత్తం ఇరవై నాలుగు లఘు కావ్యాలుకూడా ఆధునిక ఆంధ్ర సాహిత్యలోకానికి వెలుగు చూపుతున్న నక్షత్రాలే. సంఖ్యలో తక్కువైనా, శక్తిలో నభో నక్షత్రాల కంటె మిన్నలే. ఆ నక్షత్రాలు ఒక్క రాత్రిపూట మాత్రమే వెలుగుచూపుతై. ఈ కావ్య నక్షత్రాలు సర్వకాల సర్వావస్థలలోను ఆస్వాదించే వారికి ఆనందం కూరుస్తై.

ఎవరో కొద్దిమంది పండితులూ, ఇద్దరు ముగ్గురు చాద స్తపు కవులూ తప్ప, ఈ నాడు పద్యాలు వ్రాస్తున్నావారు లేరు. ఆధునిక కవులుగా ప్రచారాన్నీ, కీర్తినీ గడించుకొంటున్న వారందరూ ఫ్రీవెర్స్ (గద్యకవిత) వ్రాస్తున్నారు. ఆధునిక పరిస్థితికి గద్యం ఒక్కటే అనుకూలమైనట్టిదనీ, ఈనాటి మానవ సమస్యలు పద్యంలో ఇమడవనీ దృఢంగా విశ్వసిస్తున్నారు. పద్యం వ్రాసేవాణ్ని ఏదో నేరస్తుణ్ని చూచినట్టుకూడా చూస్తున్నారు కొందరు అత్యాధునికులు.

ఈ విధంగా తెలుగు పద్యం దిక్కులేనిదై చిక్కిశల్యమై పోయింది. నన్నయ్య, పోతన తర్వాత ప్రజలకు అర్థమయ్యే భాషలో పద్యాలు వ్రాసినవారు లేరనవచ్చు. వినగానే అర్థం కావడం, భావం హృదయానికి హత్తుకోవడం—ఈ రెండూ కవితకు ప్రాథమికంగా ఉండవలసిన గుణాలు. ఈ రెండు గుణాలనూ ఉపేక్షించి, పండితులు పద్యాన్ని పాండిత్యంతో నింపడము సాగించినందువల్లనే అది ప్రజలకు దూరమైపోయింది. ఈ రెండు లక్షణాలు ఉన్నందువల్లనే నేడు గద్య కవిత పండువెన్నెల పాల కడలిలా వెల్లివిరుస్తున్నది.

పండితులు వ్రాసే పద్యాలలో కవిత ఉండదు. కవితలేని రచన రసోత్పాదకంకాదు. అందువల్లనే పద్యం ఒక్క కవితా రంగం నుంచి మాత్రమే కాక, నాటక రంగం నుంచి కూడ వెలివేయబడడం జరిగింది.

సమర్థుడైన కవి పూనుకుంటే, ఆధునిక మానవ సమస్యలనే కాక, అణువిజ్ఞానం వరకు కూడా పద్యానికి మలచవచ్చునని, రస మధురమైన కవితను పద్యాలలో వ్రాయవచ్చునని నిరూపించి, గేయ గద్య ప్రక్రియలకు వలెనే పద్య ప్రక్రియకు కూడా బాపురెడ్డి చేసిన సేవ అత్యంత శ్లాఘనీయం.

"ప్రేయసి హాసమందు, నిరుపేదల వేదనలందు, చిన్న పాపాయిల కన్నులందు, మధుపాయిల కమ్మని పాటలందు, మిత్రియత మానసమ్ము"లందు తన కవిత విహరిస్తుందని శ్రీ బాపురెడ్డి చెప్పుకున్నాడు.

"వ్రాయగనె విలాసినులపై గేయములను
కూలిపిల్లను మరచు మూర్ఖుడను కాను"

అంటూ, ప్రకృతి సౌందర్య వర్ణనా వ్యగ్రతలో మానవుడి కష్టసుఖాలను మరిచే వాణ్నికాను అంటాడాయన తన "అద్వైత" కావ్యంలో, ఇది ఏనాటి కవికైనా ఉండవలసిన లక్ష్యం.

స్వప్నాలను, స్వాప్నిక సౌందర్యాలను, వాటి సృజన శక్తినీ "స్వప్నజగత్తు"లో అంతగా కీర్తించిన బాపురెడ్డి– స్వప్నించడం అంటే ఏదో ఆశించడం కాదనీ జీవితంలో పేరాసలు పనికి రావనీ తన "అనుతాప" కావ్యంలో హెచ్చరిస్తున్నాడు. పూలతీగల మాటునే విషసర్పాలు దాగి ఉండవచ్చు, జాగ్రత్త అంటున్నాడు.

ఈయన "వసంతోదయం" వసంతం వలెనే పరమ రసవంతం.

విజ్ఞాన మదోన్మత్తుడై స్వార్థ బుద్ధితో సర్వనాశనానికి పూనుకొన్న మానవుని కృతఘ్నతను ఖండించి ప్రకృతి మాతను బాపురెడ్డి ఓదార్చిన రీతి అనన్యసామాన్యం.

అతి సూక్ష్మ పరమాణువులోను అనంత బ్రహ్మాండంలోను కూడ చొరబడ గల మానవుడు కుల మతరాజకీయ భిత్తి కల్ని చేదించి వెయ్యలేడా? "చేదించగలడు" అంటున్నా డాయన. విజయోస్తు.

విశాలాంధ్ర అవతరించిన 1956 నవంబరు ఒకటి నాడు ఆనంద తుందిలమైన బాపురెడ్డి మనస్సు– పోయిన సతీదేవిని మళ్లీ పార్వతిలో చూచిన పరమశివుడిలా పరవశమై తాండవించింది.

అప్పుడాయన లేఖినినుంచి రెండు కావ్యములు ఉద్భవించాయి. అవి "సుప్రభాతం", "మహోదయం".

"గున్నమామిడి తన ప్రియ కోకిలమ్మ వీడిపోయి, ఆనాడు తపించి, తిరిగి నవ్యముగ నేడు కూడి గానమ్ముచేయు ఆంధ్ర తెలగాణ మేకమైనట్టి తమిని"

"ఎన్ని వసంతముల్ గడిచె, ఎన్ని ఉగాదులు వచ్చిపోవలే, దెన్నడు నాకు ఇట్లు వచియింపగా రాని మహానుభూతి, గర్వోన్నతి కల్గలేదు ! భరతోదధి నాంధ్రమహా తరంగ మిట్లెన్నడు అంబరోన్నతి గమించుచు పొంగుచు పాడలేదు !" అంటాడు బాపురెడ్డి. యావదాంధ్ర సమైక్యశక్తిపట్ల ఆయనకు అంత గాఢ విశ్వాసం.

రవీంద్రుడు, నెహ్రూ, సుభాసు బాబులను గురించి వ్రాసిన కావ్యాలు పాత్ర పోషణకు ఆదర్శాలు. ఆదర్శపురుషుల శీల చిత్రణకు దర్పణాలు.

"మనశ్శాంతి", "సరససాగరుడు", "స్నేహసౌరభము", "యౌవనవీణ", "కళాతృష్ణ" ఇవి ఆనందం పొంగులెత్తే సుందర కావ్యాలు. "మృత్యువు", "నివేదన", "ఇతి కర్తవ్యము" తాత్త్విక జిజ్ఞాసను రేకెత్తించేవి. "నెదర్లాండు", "చంద్ర విజయము" భౌగోళిక ఖగోళిక విషయ విజ్ఞానాన్ని సాహితీకరించి నట్టివి. అద్భుత రసంతో భావ శాబల్యానికి చక్కిలిగింతలు పెట్టె రచనలివి.

"ఎచ్చట చూచినన్ సుమములే, సుమకోమల బాలలే' సిరుల్ విచ్చిన జాడలే, మధువు వెచ్చదనమ్ములు పంచువాడలే, పచ్చిక బీడులే, ఘటనిభస్తన గోవుల మందలే, ఒహో అచ్చరలుండు స్వర్గమిదియా అనిపించెడి వింత నేలలే"

నిండైన ఈ నెదర్లాండు సౌందర్యాన్నంతాచూచి అనుభవించి వచ్చిన బాపురెడ్డి కావ్యకలశాలలో దాన్ని మనకందిస్తున్నాడు. మనం అక్కడికి వెళ్లలేకపోయినా — ఇక్కడైనా దాన్ని అందుకొని ఆస్వాదిస్తాం.

అక్షర లక్షలుచేసే ఇలాంటి రసగుచ్ఛాలతో నిండి ఉంది ఈ బాపురెడ్డి పద్య కావ్యోద్యానం.

ఇది శ్రీ పి. వి. జి. కృష్ణమాచార్యులు, ఐ.సి.యస్. గారికి అంకితం.

"శ్రీ బాపురెడ్డిగారి రచన సర్వత్రా వారి హృదయమువలెనే ప్రసన్నమై, మధురమై, చదివినకొలది చదువవలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది. పద్యములన్నియు ధారాశుద్ధి శోభితములును, భావ గంభీరములునునై, మకరంద ప్రవాహమువలె, సాగిపోవుచున్నవి". అంటూ—ఆచార్య డాక్టర్ దివాకర్ల వేంకటావధాని గారు ఈ కావ్య సంపుటికి తాము వ్రాసిన పదిపేజీల విపుల పీఠికలో పేర్కొన్నారు.

"ఎంత అధునాతనమైన, శాస్త్ర విజ్ఞాన సమన్వితమైన వస్తువునైనా సనాతన ఛందో బంధురమైన పద్యాలలో చెక్కు చెదరకుండా, రస నిర్భరంగా చిత్రించే వీలున్నదని చెప్పడానికి ఈ కావ్యసంపుటిలో కొంత ప్రయత్నం చేసాను" అంటాడు బాపురెడ్డి ఈ "పుస్తకం పుట్టుపూర్వోత్తరాలు" గురించి చెపుతూ.

"బాపురెడ్డి గేయ నాటికలు" అనేది మరోగ్రంథం. ఇందులో ఆరు గేయనాటిక లున్నై.

కలంపట్టిన నాటినుంచి బాపు రెడ్డి రకరకాల ప్రక్రియలలో రచనలు చేస్తూ వస్తున్నాడు. పద్యాలు, గేయాలు, గేయ నాటికలు, వచన కవితలు—ఇలా ఏ వస్తువుకు, ఏ భావానికి ఏ ప్రక్రియ అనుకూలమనుకుంటే, ఆ ప్రక్రియ ధారాపాతంగా కదలి వస్తుంది. ఆయన లేఖినినుంచి.

"ఈ గేయ నాటికలు కావ్య వాటికలు, రమ్య చేటికలు, రత్న పేటికలు" అన్నారు దాశరథిగారు—ఈ గ్రంథానికి పీఠిక వ్రాస్తూ.

"బాపురెడ్డి గడుసుకవి. గేయంలోనూ వచనమంత సాఫీగా సంభాషణలు నడిపించగల శక్తిమంతుడు" అన్నారాయన.

గేయ నాటికలన్నా, నృత్య నాటికలన్నా ఒక్కటే. ఇందులోని "ఋతురాగం" విశాఖ వైద్య విద్యార్థినులచే నృత్య మధురంగా, సంగీత సుందరంగా ప్రదర్శించ బడినట్టిది. ఋతురాగం, కల్యాణయాత్ర, విజయహేల. ఈ మూడుకూడా ఆకాశవాణిలో సంగీత నాటికలుగా ప్రసారమైనై.

ఇందులో ఋతురాగం ఒక అద్భుత కల్పన. ఇంతవరకు ఋతువులను గురించి, కాలాన్ని గురించి ఈ విధమైన భావనచేసినవారు తెలుగుకవులలోలేరు.

ఆరు ఋతువులూ, ఆరుగురు కాంతలు. కాలపురుషుని ఇల్లాండ్రు. ఒకరితర్వాత ఒకరు, ఒకరిని గురించి ఒకరు తమ తమ గొప్పలు చెప్పుకోవడం, కలిసి కలహించుకోవడం కాలపురుషుడు తగవు తీర్చడం ఎంతో రాగమధురంగా వుంటుంది. మనోరంగంమీద ఈ పాత్రలను మనం స్పష్టంగాచూస్తాం, చదువుతూ ఇక్కడ బాపిరెడ్డి గొప్ప శిల్పిగా నాట్యకళా వేత్తగా కనిపిస్తాడు.

"నాపద ముద్రలు తాకిన నేలలు
నవీనసస్యశ్యామల సీమలు"

అని వర్షాసుందరి అంటే—శరద్బాల "చాలు చాలు నీగొప్పలు" అంటూ ముందుకువచ్చి—

"గంగా గోదావరులను
గల్లంతులు చెయలేదె ?
నిండు బ్రతుకు లెన్నెన్నో
నీళ్ళ పాలు చేయలేదె ?"

అని ఎదిరిస్తుంది. వర్షా సుందరి నిష్క్రమించగా—శరద్బాల తన గొప్పలు చెప్పుకొంటుంది. ఆమెను హేమంతకాంత ఎదిరి

స్తుంది. ఈవిధంగా ఆయా ఋతువుల నోటినుంచే వారివారి మంచినీ, చెడ్డనూ కూడ చెప్పించాడు బాపురెడ్డి. ఆయా ఋతువుల హృదయాలలోని అందాలను, దౌర్జన్యాలను, కన్నీటినీ వెలికి లాగి, కావ్య మధువుగా అందించాడు లోకానికి.

"సాగర సౌధం" కృష్ణపై నాగార్జున సాగర నిర్మాణాన్ని కవితీకరించిన నాటిక. ఇందులో కృష్ణవేణి, నాగార్జునుడు, ప్రజా శక్తి, నేపథ్య కంఠం పాత్రలు.

"నారు పోసినవాడు నీరుపొయ్యడా ?" అనేది పూర్వకథ. "నీరుపోయలేనివాడు నారు పొయ్యగూడదు." అనేది నేటి అనుభవం. ఈ శాస్త్ర సత్యాన్ని పురస్కరించుకొని బాపురెడ్డి నిర్మించిన గేయ సౌధం "భావి జీవులు", నేపథ్యవాణి, దేశకాలాలు, భావి జీవులు ఇందులోని పాత్రలు.

విజయ దశమికి స్వాగత నీరాజనం "విజయ హేల" నాటిక. ఒక నాలుగు కంఠాలు, విజయదశమి, ఇందులో పాత్రలు.

భావఘర్షణ వస్తువుగా రూపొందిన నాటికి "కల్యాణ యాత్ర". ప్రకృతి, ప్రేయసి, మాతృదేవి, కష్టజీవి, భాగ్యలక్ష్మి దేశమాత, మానవుడు ఇందులో పాత్రలు. ఈ శక్తులన్నీ మానవుణ్ణి చుట్టుముట్టి, తమతమ ప్రభావ పరిధిలోకి ఆకర్షిస్తే. ఈ ఘర్షణలో కర్తవ్యతావిమూఢుడైన మానవుడు తుదకు ఒక నిశ్చయానికి వచ్చి, సర్వశక్తి సమన్వయ పథంలో ముందుకు సాగుతాడు.

చివరిది "రాకెట్టు రాయబారం". ఏడేళ్ళక్రితం ఈ పేరుతో ప్రకటించబడ్డ బాపురెడ్డి కావ్య సంపుటిలో ఈ రచన ఒకటి. చంద్రలోకానికి భూలోక వాసుల రాయబారం ఇందులో వస్తువు.

ఈ ఆరూ కాక, అంకితాన్నికూడా ఒక గేయ నాటికగా వ్రాశాడు బాపురెడ్డి. ఇందులో భావ సఖి, కావ్య కన్య, కావ్యకర్త, నేపథ్యం పాత్రలు. నట సమ్రాట్టు శ్రీ గుమ్మడికి ఈకృతి అంకితం.

"వివిధ సందర్భాలలో, విభిన్న మనః ప్రవృత్తులలో వ్రాసిన కవితలివి. సౌందర్యారాధన, విశ్వజనీనత, సర్వమానవ సౌభ్రాత్రం అంతస్సూత్రంగా అల్లుకొన్న భావమంజరులు. నింగినీ, నేలనూ కలపడానికి నేను నిర్విరామ కృషితో నిర్మించిన రస రాగసోపానాలు." అంటాడు బాపురెడ్డి— ఈ తన రచనలను గురించి, ఇంతటి ఉదాత్త లక్ష్యంతో సాహితీ సృష్టి చేస్తున్నవారు చాల అరుదు.

—బోయి భీమన్న

---

# బంజరు భూములు పంచారు

—జె. బాపురెడ్డి

బంజరు భూములు పంచారు
బ్రతుకు బాట చూపించారు

ఏమీలేని పేదవారికి
ఎవ్వరుకానవి హరిజనాళికి
అచ్చంపేట కొండవారికి
అరకబట్టగల కూలివారికి—బంజరు॥

పాలేరుండిన కూలివారికి
పస్తులు పండిన పేదవారికి
తాసిల్దారులు, తాలుఖ్దారులు
దేశనాయకులు, మంత్రివర్యులు —బంజరు॥

పట్టాలిచ్చిననాడె, ఉగాది
పండుగైనది బీదసాదలకు
పంటలు పండిననాడే, లక్ష్మి
ఇంటికివచ్చెను నిరాధారులకు—బంజరు॥

ఎరువులకోసం, ఎద్దులకోసం
అప్పులుగూడ ఇప్పించారు
చిన్నరైతులు మిన్నగచేసే
సేద్యపు రీతులు చెప్పించారు—బంజరు॥

ఆలు మగలు ఒక్క రెక్కగా
అలసట అనక కష్టించాలి
పిల్లలనేమో చదివించాలి
చల్లని భావిని నిర్మించాలి—బంజరు॥

# జిల్లాలనుండి

## అదిలాబాదులో మామిడి తోపులు

అదిలాబాదు జిల్లా చిన్నూరు పంచాయతీ సమితిలోని 8 గ్రామాలలో 1100 ఎకరాలలో మామిడి తోపులు వేయడానికి రూపొందించిన పథకాన్ని ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకువారు మంజూరు చేశారు. ఈ పథకానికయ్యే ఖర్చు రూ. 2.22 లక్షలు వుంటుంది. ఈ మొత్తం మూడేండ్లలో ఖర్చు పెట్టడం జరుగుతుంది. ఈ పథకం వల్ల 200 మంది వ్యవసాయదారులకు లాభం కలుగుతుంది. అదిలాబాదు జిల్లా కలెక్టరు శ్రీ అల్లాయార్ ఖాన్ స్వయంగా ఈ పథకాన్ని తయారు చేశారు.

వ్యవసాయదారులకు చిన్నూరు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకు ద్వారా ఇచ్చే అప్పులను 10 ఏండ్లలో తిరిగి చెల్లించవలసి వుంటుంది. ఈ పథకం క్రింద పని చురుకుగా కొనసాగుతున్నది.

## పంచాయతీ రాజ్యంపై నివేదిక

ఉపముఖ్యమంత్రి శ్రీ జె.వి. నర్సింగరావు ఇటీవల తాడికొండలో జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ రాష్ట్రంలో పంచాయతీరాజ్ పని విధానాన్ని గురించి జలగం వెంగళరావు నివేదికలోని సిఫార్సులను ప్రభుత్వం అమలుపరుస్తుందని చెప్పారు.

తాడికొండ గ్రామస్తులు ఉపముఖ్య మంత్రికి వినతి పత్రం సమర్పిస్తూ ఈ సమితిలోని 20 గ్రామాలకు నాగార్జున సాగరు జలాలను సరఫరా చేయాలని అభ్యర్థించారు.

ఈ సందర్భంలో కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ కె. రఘురామయ్య మాట్లాడుతూ జాతీయం చేయబడిన బ్యాంకుల ద్వారా రైతులకు సహాయం చేయడం జరుగుతుందని చెప్పారు. ఈ బహిరంగ సభకు శాసన సభ్యులు శ్రీ జి.వి. రత్తయ్య అధ్యక్షత వహించారు.

ఉపముఖ్య మంత్రి శ్రీ జె.వి. నర్సింగరావు పెదపరిమిలో జరిగిన బహిరంగ సభలో మాట్లాడుతూ తాడికొండ నుంచి కంతేరు వరకు రెండు వంతెనలతో సహా రోడ్డు త్వరలో నిర్మించబడుతుందని తెలిపారు. గ్రామాభ్యుదయానికి ప్రజలందరూ సహకరించాలని కృషి చేయాలని ఆయన వినతి చేశారు.

ఆ తరువాత ఉపముఖ్యమంత్రి తాళ్లూరులో జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ రూ. 8 లక్షల ఖర్చుతో తాడికొండ—మంగళగిరి రోడ్డు తయారు చేయబడిందనీ, ఈ రోడ్డు 6 నెలల్లో పూర్తి అవుతుందనీ తెలిపారు. బీద ప్రజలకు గృహవసతి కల్పించే నిమిత్తం ఈ సంవత్సరం రూ. 1.5 కోట్లు ఖర్చు పెట్టడం జరుగుతుందని కూడా ఆయన చెప్పారు.

శాసన సభ్యులు శ్రీ సి.హెచ్. హనుమయ్య, జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. నాగేశ్వరరావు కూడా ప్రసంగించారు.



వైద్య ఆరోగ్య సేవా శాఖ డైరెక్టరు డా. రమేష్ షాఫ్ కడపలో జరిగిన ట్యుబెక్టమీ శిబిరాన్ని సందర్శించారు. దీనిలో 100 పడకలు ఏర్పాటు చేయబడినవి.

## తూర్పుగోదావరి జిల్లాలో మొక్కలరక్షణ చర్యలు

తూర్పుగోదావరి జిల్లాలో మొక్కలకు తెగుళ్లు రోగాలు ప్రబలినపుడు వాటిని నిర్మూలించడానికి కాకినాడలో మొక్కల రక్షణ దళం ఏర్పాటు చెయబడింది. ఈ దళంలో ఒక ప్లాంటు ప్రొటెక్షన్ అసిస్టెంటు, ఇద్దరు ఫీల్డుమెన్, 8 మంది మేస్త్రీలు ఒక మెకానిక్, హెల్పర్ ఉన్నారు. వీరి ప్రధాన కార్యాలయం కాకినాడలో వుంది. జిల్లాలో ఒక చోటి నుంచి మరొక చోటికి పోవడానికి మొక్కల రక్షణ పరికరాలు కూడిన ఒక వ్యాను కూడా వుంది. ఈ దళానికి 22 పవర్ స్ప్రేయర్లు 100 చేతితో నడిచె స్ప్రేయర్లు వున్నాయి.

వ్యాను అసిస్టెంటు, క్రిమిహారక మందుల విక్రయానికి కృషి చేయడమే గాక మొక్కల రక్షణ పరికరాలను అవసరమైన రైతులకు అద్దె పద్ధతి పైన అరువు ఇస్తారు. అతను స్వయంగా తెగులు వ్యాపించిన పొలాలకు వెళ్ళి బ్లాకు స్థాయిలో ఇద్దరు సహాయకులు, వ్యవసాయ విస్తరణ అధికారి సహాయంతో మొక్కల రక్షణ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. యంత్రపరికరాల మరమ్మతులను మొక్కల రక్షిత దళం వారు స్వయంగా నిర్వహిస్తారు.

## వీధి దీపాలకు ప్రారంభోత్సవం

చిత్తూరు జిల్లా, మదనపల్లి పంచాయతీ సమితిలోని చిన్న సముద్రం గ్రామ పంచాయతీకి చెందిన రెడ్డిపారి పల్లెలో రివిజినల్ పంచాయతీ ఆఫీసరు శ్రీ టి. రానప్ప వీధిదీపాలకు ప్రారంభోత్సవం చేశారు. పంచాయతీ ఉపాధ్యక్షుడు శ్రీ జగన్నాధగుప్త అధ్యక్షత వహించారు.

రివిజినల్ ఎలక్ట్రికల్ ఇంజనీరు శ్రీ బి. రామస్వామి రెడ్డి యీ సందర్భంలో ప్రసంగిస్తూ గ్రామీణ విద్యుదీకరణకు సంబం



రివిన్యూ బోర్డు 2 వ సభ్యులు శ్రీ యస్. భగవాన్ దాస్ ఆగస్టు 3 వ తేదీన నిజామాబాద్‌లో భూపరిశీలన లేబరేటరీకి ప్రారంభోత్సవం చేశారు.

ధించి యీ ప్రాంతంలో అమలు జరుపుతున్న పథకాలను గురించి వివరించారు. విద్యుచ్ఛక్తి శాఖ చేకూరుస్తున్న సౌకర్యాలను సక్రమంగా వినియోగించుకోవలసిందిగా ఆయన రైతులను కోరారు.

## భూములులేనివారికి పట్టాల పంపిణీ

వరంగల్లు జిల్లా కలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్, ఐ. ఎ. యస్. జూలై 31 వ తేదీన జనగామ పంచాయతీ సమితిలోని నారాయణపూరు గ్రామంలో భూములులేని 63 మంది బద ప్రజలకు 60 ఎకరాల బంజరుభూములకు పట్టాక్రింద పంచిపెట్టారు. ఈ సందర్భములో ఏర్పాటు చేయబడిన బహిరంగ సభకు సమితి ప్రెసిడెంటు శ్రీ డి. శ్రీరామరెడ్డి అధ్యక్షత వహించారు. ఈ బహిరంగ సభలో కలెక్టరు ప్రసంగిస్తూ వరంగల్లు జిల్లాలో సుమారు 3 లక్షల మంది హరిజనులున్నారనీ, అయితే పంపిణీ కొరకు 2,000 ఎకరాలు మాత్రమే ఉన్నాయనీ చెప్పారు. కనుక ప్రభుత్వం కానీ, ప్రభుత్వేతర సంస్థకానీ సంఘోద్ధరణకు పూను కోవాలని ఆయన అన్నారు. ఆయన హరిజనులకు ఒక జత ఎద్దులు, 30 ఇండ్ల స్థలాలుకూడా మంజూరు చేశారు.

## గుంటూరులో తెగుళ్ళవల్ల 25,000ఎకరాల వరిపంటకు దెబ్బ

గుంటూరు జిల్లాలోని తెనాలి, రేపల్లి, బాపట్ల తాలూకాలలో 25,000 ఎకరాలలో రైస్‌హిస్పా అనే తెగులు వచ్చి నారుపోసిన వరిపంట దెబ్బతినింది. వ్యవసాయశాఖ సమితి సిబ్బందివారు తెగులును అరికట్టడానికి మొక్కల రక్షణ కార్యక్రమాలను తీవ్రతరంగా అమలు జరుపుతున్నారు. పంట దెబ్బతిన్న ప్రాంతాలకు మొక్కల రక్షణ పరికరాలు క్రిమి సంహారక మందులు తరలించడం జరిగింది. ఈ చర్యల ఫలితంగా 20,000 ఎకరాలలో వరి చేనులకు తగిలిన తెగులును అదుపులో పెట్టడం జరిగింది. ఇతర ప్రాంతాలలో కూడా మొక్కల రక్షణ కార్యక్రమాలు చురుకుగా కొనసాగుతున్నాయి.

గుంటూరు జిల్లా కలెక్టరు శ్రీ యం. వెంకటరత్నం, వ్యవసాయ శాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ యం. వి. భాస్కరరావు జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. నాగేశ్వరరావు ఆర్. డి. ఓ శ్రీ టి. సత్యరాజు గారలతోపాటు ఇటీవల తెనాలి గ్రామాలలో వరి చేనులను పరిశీలించారు.

ఈ ప్రాంతంలో హెలీకాప్టర్లద్వారా పొలాలపై మందులు చల్లించాలనీ, సబ్సిడీ పథకం క్రింద క్రిమిహారక మందులు సరఫరాచేసి, ఆ మొత్తాన్ని వచ్చేసంవత్సరం రెవిన్యూ శిస్తుతోపాటు వసూలు చేయాలనీ రైతులు జిల్లా కలెక్టరును అభ్యర్థించారు. ఈ విషయమై ఇదివరకే ప్రభుత్వానికి నివేదిక పంపడం జరిగిందనీ ఆంధ్రప్రదేశ్ వ్యవసాయక తెగుళ్ళు, వ్యాధుల చట్టంక్రింద ఈ ప్రాంతాన్ని "తెగులు పీడిత ప్రాంతం" గా ప్రకటించాలని కోరడం జరిగిందనీ కలెక్టరు సమాధానం చెప్పారు.

ఈ లోపల రైతులు సర్పంచులు, సమితుల అధ్యక్షులు మున్నగువారు పంట చెడిపోకుండా, తెగుళ్ళు ఇతర ప్రాంతాలకు వ్యాపించకుండాను వెంటనే మందులు ప్రయోగించి, తెగులును అరికట్టాలనీ సలహా ఇచ్చారు.

## స్కూలు భవనానికి ప్రారంభోత్సవం

నిజామాబాదు జిల్లా సమితి అధ్యక్షులు శ్రీ జి. మధుసూదన రెడ్డి జూలై 30 వ తేదీన ఆర్మూరు పంచాయతి సమితిలోని మెంధోరా గ్రామంలో ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో బి. డి. ఓ. శ్రీ ఏ. వి. కృష్ణారావు పిల్లలు విద్యనభ్యసించవలసిన అవసరాన్ని గురించి ప్రసంగించారు. పిల్లలనందరినీ స్కూలుకు పంపవలసిందని తల్లిదండ్రులకు హితవుచేశారు.

ఈ సమితి బున్నాపూరు గ్రామంలో హరిజన దినోత్సవం కూడా జరిపింది. సమితి అధ్యక్షులు తమతమ ఇండ్లను పరిశుభ్రంగా నుంచుకొన్న హరిజన కుటుంబాలకు బహుమతులు పంచిపెట్టారు. ఈసందర్భంలో సమాచార శాఖ గ్రామంలో చలన చిత్ర ప్రదర్శన ఏర్పాటుచేసింది.

## గ్రామీణ విద్యుత్ కరణ

విశాఖపట్నం సూపరింటెండింగ్ ఇంజనీరు (విద్యుచ్ఛక్తి శాఖ) శ్రీ కృష్ణారావు విశాఖపట్నం జిల్లా వెంకటాపురం గ్రామంలో జూలై 26 న వీధిలైట్లకు స్విచ్ నొక్కి గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభకు చిన్నముషిడివాడ గ్రామ సర్పంచ్ శ్రీ డి. సత్యనారాయణ అధ్యక్షత వహించారు.

వ్యవసాయం పరిశ్రమల ప్రయోజనంకొరకు విద్యుచ్ఛక్తి అవసరాన్ని గురించి సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ కృష్ణారావు

పెందుర్తి బి.డి.ఓ. శ్రీ సి. హెచ్. సన్యాసిరాజు, సర్పంచ్ శ్రీ డి. సత్యనారాయణ గారలు ప్రసంగించారు.

అంతకుముందు వెంకటాపురం సర్పంచ్ శ్రీ గార్లె అప్పారావు అధికారులకు అనధికారులకు స్వాగతం చెప్పారు:

## విద్యామంత్రి సర్వోదయ ఆశ్రమం సందర్శన

విద్యాశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, చిన్నతరహా నీటిపారుదల శాఖ మంత్రి, శ్రీ పురుషోత్తమరెడ్డి జూలై 27న నల్గొండ తాలూకా సర్వేలు గ్రామాన్ని మంత్రి, సందర్శించి అక్కడ శ్రీ నారాయణరెడ్డి ప్రస్తుతం నిర్వహిస్తున్న ఆశ్రమభవనంలో జూనియర్ కళాశాలనుగానీ, బీహారు రాష్ట్రంలో నిర్వహిస్తున్న మాదిరిగా. పబ్లిక్ పాఠశాలనుగానీ నెలకొల్పడానికిగల అవకాశాలను గూర్చి పరిశీలించారు.

భారతీయ సంస్కృతి, సర్వోదయ సిద్ధాంతాల ప్రాతిపదికపై ఆదర్శవంతమైన పాఠశాలను అక్కడ విజయవంతంగా నిర్వహించడానికి శ్రీ నారాయణరెడ్డి అంగీకరిస్తారనే ఆశాభావాన్ని విద్యామంత్రి వ్యక్తంచేశారు. ప్రభుత్వ సహాయం లభిస్తుందని మంత్రి హామీ ఇచ్చారు. తర్వాత ఉన్నతపాఠశాలను తనిఖీచేశారు.

## కుటుంబ నియంత్రణ ప్రచార కార్యక్రమం

కుటుంబనియంత్రణ విషయంలో కొంత వెనుకబడివున్న హైదరాబాదుజిల్లా ఇప్పుడు నిర్ణయించిన లక్ష్యాలను సాధిస్తున్నది. ఇంతవరకు ప్రజాదరణ పొందని ట్యూబెక్టమీ క్యాంపులు ఇప్పుడు ప్రోత్సాహకరమైన ఫలితాలను సాధిస్తున్నాయి. చేవెళ్ళలో ట్యూబెక్టమీ శిబిరం నిర్వహించబడింది. అల్వాల్, శంషాబాదులలో ఇప్పుడు ఈ శిబిరాలు నిర్వహించబడుతున్నాయి.

అల్వాల్, శంషాబాదు శిభిరాలలో 400 ట్యూబెక్టమీ ఆపరేషనులు జరిగాయి. ట్యూబెక్టమీల విషయమై ప్రజలు ఎక్కువ ఆసక్తి చూపుతున్న కారణాన, జిల్లా అంతటా ఈ శిబిరాలను నిర్వహించాలని నిర్ణయించబడింది.

హైదరాబాదు జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. భోజరెడ్డి ఇటీవలనే శంషాబాదులో కుటుంబనియంత్రణ ప్రచార కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో దేశక్షేమం కొరకు కుటుంబనియంత్రణ పాటించవలసిన అవసరాన్ని గురించి ప్రసంగించారు.

## గిరిజన స్త్రీలకు చీరల పంపిణీ

మహిళా సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ శ్రీకాకుళం జిల్లా సీతంపేట పంచాయతి సమితిలోని కుద్రపల్లి గిరిజన కాలనీని సందర్శించి అక్కడ 40 మంది గిరిజన స్త్రీలకు చీరలు పంచిపెట్టారు.

మంత్రిణి గిరిజన హాస్టలు, ఆశ్రమ స్కూలు, హైస్కూలు, గిరిజన కార్పొరేషను, గిరిజన సమితి ఆఫీసులను దర్శించారు. బాగా చదువుకొని పైకిరావాలని ఆమె గిరిజన విద్యార్థులకు సలహా ఇచ్చారు.



హైదరాబాదు జిల్లా కలెక్టరు శ్రీ నరసింగ్‌రాజ్ రాజేంద్రనగర్ బ్లాకులోని ఖాన్‌ర్‌పూలో గ్రంథాలయ భవనానికి ఆగస్టు 8వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

మహిళా మండలి కార్యదర్శి శ్రీమతి సావిత్రిగారు మంత్రిణితో మాట్లాడుతూ మండలిలోని సభ్యులు కుట్టుపని నేర్చుకోవడమేకాక అడ్డాకులు తయారుచేయడం, చింతపండులో చింతగింజలు వేరుచేయడం మున్నగుపనులు చేస్తూ డబ్బు గడిస్తున్నారని తెలిపారు. సభ్యులు తమ పిల్లలను స్కూలుకు పంపాలని వారికి మంత్రి సలహా ఇచ్చారు.

## యాత్రా కేంద్రంగా కళింగపట్నం అభివృద్ధి

యాత్రి విషయాల శాఖామంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ జూలై 12వ తేదీన శ్రీకాకుళం దగ్గర శాలిహుండం కొండలపైన వున్న బౌద్ధస్తూపాలను, వంశధార నదిని, కళింగపట్నం సముద్ర తీరాన్ని తిలకించి అక్కడి ప్రకృతి రమణీయతను మెచ్చుకొన్నారు.

కళింగపట్నం అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించాలని, బెస్తల అభివృద్ధి చర్యలు తీసుకోవాలని ఆ గ్రామస్తులు మహిళామండలి సభ్యులు బెస్తలు, మంత్రిణికి వినతిచేశారు. ఇక్కడ రేవును, మత్స్య కేంద్రాన్ని అభివృద్ధి పరచవలసిన అవసరం వుందని మంత్రిణి తమ అభిప్రాయం వెలిబుచ్చారు. వచ్చే సంవత్సరం, కళింగపట్టణాన్ని యాత్రాభివృద్ధి కేంద్రంగా అభివృద్ధి పరచడం జరుగుతుందనీ అంతేకాకుండా మహిళా సంక్షేమ, కార్యక్రమాలు కొన్ని చేపట్టడం జరుగుతుందనీ ఆమె హామీ ఇచ్చారు.

## గిరిజనులకు బంజరు భూమి పంపిణీ

శ్రీకాకుళం జిల్లా పాతపట్నం తాలూకాలో 2,823 మంది గిరిజనులకు 3,672 ఎకరాల బంజరు భూములను పంపిణీచేసినట్లు తహశీల్దారు శ్రీ కె. వి. రమణరావు తెలిపారు. పాతపట్నంలోని ఏజెన్సీ వుత్పత్తుల సహకార మార్కెటింగ్ సంఘం



యాత్రా విషయాల మంత్రి శ్రీమతి రోడా మిస్త్రీ జులై 19 వ తేదీన నిపుణుల బృందంతో నాగార్జున సాగర్ సందర్శించారు.

డైరెక్టర్ల బోర్డు సమావేశం ఇటీవల టెక్కలిలో సబ్ కలెక్టరు శ్రీ టి. ముని వెంకటప్ప అధ్యక్షతన జరిగింది. ఆ సమావేశంలో విత్తనాలు, ఎరువులు మొదలైన వాటి కొనుగోలు నిమిత్తం గిరిజనులకు ఋణాలు ఇచ్చేందుకై మొదటి వాయిదా క్రింద రూ. 5,000 ల మొత్తాన్ని మంజూరుచేశారు.

## వరంగల్లులో మార్కెటు యార్డు

మార్కెటింగ్ శాఖా మంత్రి, శ్రీ రామచంద్రరావు కల్యాణి జులై 11 వ తేదీనాడు వరంగల్లులో మార్కెటింగ్ సంఘం సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ రూ. 8.30 లక్షల మేరకు మార్కెటు కమిటీ నిధులను మార్కెటు యార్డు అభివృద్ధికి వినియోగించాలని అన్నారు. అవసరమైతే మరికొంత ఋణాన్ని మంజూరుచేస్తారని ఆయన హామీయిచ్చారు.

అంతకుముందు సభ్యులకు నాయకత్వం వహించిన శ్రీ రంగారెడ్డి ప్రసంగిస్తూ అధిక దిగుబడి వరి వంగడాల సేద్యం ప్రారంభించిన అభ్యుదయ రైతు నష్టం ఎదుర్కొంటున్నారని అందువల్ల ప్రభుత్వం ఐ. ఆర్. 8 కు నిర్ణయించిన రూ. 51 ల కనీస ధర పునరుద్ధరించడానికి చర్యలు తీసుకోవాలని మంత్రికి విజ్ఞప్తి చేశారు. గిట్టుబాటు ధరల కొనసాగింపుకు ధాన్యం రవాణా స్వేచ్ఛగా జరగాలని తద్వారా యితర రాష్ట్రాలకు ఉప్పుడి బియ్యాన్ని ఎగుమతి చేయడానికి వీలు కలుగుతుందని సభ్యులు అన్నారు. పౌర సరఫరా శాఖామంత్రితో యీ విషయం చర్చించుతానని మంత్రి హామీ యిచ్చారు.

మార్కెటు యార్డు అభివృద్ధి విషయాన్ని గూర్చి విన్నవించుతూ మార్కెటు సంఘం అధ్యక్షుడు శ్రీ మృత్యుంజయ లింగం మంత్రికి విజ్ఞాపన పత్రాన్ని అందజేశారు.

## పండితుల సమావేశం

మహిళా సంక్షేమం, యాత్రా వ్యవహారాల శాఖల మంత్రి శ్రీమతి రోడా మిస్త్రీ, శ్రీకాకుళంలో పండితుల సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ కళల అభివృద్ధికి డబ్బే ప్రధానంకాదనీ, వ్యక్తిగత కృషికూడా ప్రాధాన్యత వహిస్తుందని అన్నారు. జిల్లాలో విస్తారంగా వ్యాపించిన కుష్ఠువ్యాధి నిరోధానికి పండితులు ప్రజలకు ప్రబోధించాలని ఆమె అన్నారు. బర్మా తర్వాత యీ జిల్లాలోనే కుష్ఠువ్యాధి ఎక్కువగా ఉంది. క్షయవ్యాధికన్నా భయంకరమైనది కాకపోయినప్పటికీ కుష్ఠు సాంఘిక వ్యాధి అని ఆమె అన్నారు.

మహిళా సంక్షేమ శాఖ సహాయ డైరెక్టరు శ్రీమతి సీతాదేవి ప్రసంగిస్తూ ప్రజలు మార్పుకోరుతున్నారనీ, అయితే ఉత్తమ జీవన స్థాయికి ఎటువంటి మార్పు కావాలో వారికి బోధపడకుండా ఉన్నదనీ, యీ విషయంలో పండితులు దేశానికి మార్గం చూపాలనీ అన్నారు.

సమావేశానికి అధ్యక్షత వహించిన శాసనమండలి సభ్యులు, శ్రీ ఎన్. టి. పి. వి. కూర్మాచార్యులు ప్రసంగిస్తూ భాషా పండితులలో తగినంత మంది మహిళలు ఉన్నారని అన్నారు.

ఇతర ఉపాధ్యాయులతో పాటుగా పండితులకు కూడా సమానమైన హక్కులు కల్పించాలని యితర వ్యక్తులు అభిప్రాయ పడినారు.

## మెదక్ జిల్లాలో 45,000 ఎకరాల భూమి పంపిణీ

మెదక్ జిల్లా కలెక్టరు శ్రీ ఎన్. చక్రవర్తి జులై 19 వ తేదీన మెదక్‌లో, భూములులేని బీద ప్రజలకు పట్టా సర్టిఫికెట్లు పంపిణీచేశారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ ఆయన కేవలం పట్టా సర్టిఫికెట్లు కలిగివున్నంత మాత్రాన ఈ ప్రజల ఆర్థిక పరిస్థితి చక్కబడదనీ, కాబట్టి వారు కష్టించి పనిచేసి తమకు అప్పగించబడిన భూములలో పంటలు పండించాలనీ అన్నారు.

అందుబాటులోవున్న ప్రభుత్వ భూములన్నింటినీ భూములు లేని వారికి పంచిపెట్టడం కొరకు ప్రభుత్వం ముమ్మర కార్యక్రమాన్ని ప్రారంభించడం, భూములు పొందినవారు సమితి ఎక్స్‌టెన్షన్ బృందం, సహకార పద్ధతి సంఘాలు మొదలైన సంస్థలు లభింపజేస్తున్న సహాయ సహకారాల ద్వారా తమ ఆర్థిక పరిస్థితిని చక్కబరుచుకోవడానికి అవకాశం కల్పించడం గ్రామాలలోని బీదలకు వరప్రసాదం వంటిదని ఆయన అన్నారు. ఈ జిల్లాలో 47,000 ఎకరాల భూమి అందుబాటులో వుండగా యిప్పటివరకు 45,000 ఎకరాల భూమిని భూములు లేని బీదవారికి పంచిపెట్టడం జరిగిందనీ, మిగతా 2,000 ఎకరాల భూమిని పంపిణీచేసే విషయంలో అవసరమైన లాంఛనాల పూర్తి కావచ్చినవనీ ఆయన అన్నారు.

జిల్లా రెవెన్యూ ఆఫీసరు శ్రీ ఇ.ఎన్.ఎస్. శర్మ, మెదక్ సబ్ కలెక్టరు శ్రీ అర్జునరావు ఈ సందర్భంలో ప్రసంగించారు.

మెదక్ తాలూకాలోని ఫరీద్‌పూర్‌కు చెందిన 80 మందికి, మెట్టాయి పల్లికి చెందిన 135 మందికి, సర్ధానాకు చెందిన 158 మందికి పట్టా సర్టిఫికెట్లు పంపిణీచేశారు. పట్టా సర్టిఫికెట్లు

పొందిన 373 మంది భూములు లేని పేద ప్రజలలో నిమ్నజాతులు, నిమ్న తెగలవారు 257 మంది వున్నారు. తహశీల్దారు శ్రీ నాగ లింగారెడ్డి వందన సమర్పణచేశారు.

## హరిజన దినోత్సవంనాడు 732 పట్టా భూముల పంపిణీ

నెల్లూరు జిల్లా, కోవూరు పంచాయతి సమితిలోని రామలింగాపురంలో జూలై 30 న హరిజన దినోత్సవం జరిగిన సందర్భంగా దగదర్తి, ఉచ్చగుంటపాలెం, ముండ్లపూడి, చేత్రపూతేడు, మరిమెల్ల, కొత్తపంగళ్లు, వావిరు, పెద్దపుత్తేడు, పెన్నూరు గ్రామాలకు చెందిన భూములులేని పేద ప్రజలకు కావలి ఆర్. డి. ఓ శ్రీ వై. రాజగోపాలసింగ్ 732 పట్టా భూములను, 45 ఇండ్ల స్థలాలను పంచిపెట్టారు. ఈ ప్రాంతంలో ఇంత వరకు వెయ్యి ఎకరాలు పేదప్రజలకు పంచిపెట్టడం జరిగింది.

## రసాయనిక ఎరువుల వాడకం కార్యక్రమానికి ప్రారంభోత్సవం

న్యూఢిల్లీలోని యూరోపియన్ నైట్రోజన్ సర్వీసు ప్రోగ్రాం సంస్థ ఆరంభించిన రసాయనిక ఎరువుల వినియోగ కార్యక్రమానికి జూలై 27 న నల్గొండజిల్లా కలక్టరు శ్రీ రమేశ్ గ్రోవర్ హుజూరునగర్ పంచాయతి సమితిలోని ఒక పొలంలో వరినాటుపోసి ప్రారంభోత్సవం జరిపారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగసభలో ఆయన ప్రసంగిస్తూ నల్గొండజిల్లా "వ్యవసాయవిప్లవం"లో అడుగుపెడుతున్నదని చెప్పారు. రైతులు ఇప్పుడు ఆధునిక సేద్యపు పద్ధతులను అనుసరిస్తున్నారు. ఇ. ఎన్. ఎస్. పి. వారు రసాయనిక ఎరువుల వాడకాన్ని ప్రోత్సహించడానికి ప్రయోగాత్మకమైన కార్యక్రమాలను చేపట్టడం ముదావహమైన విషయం. ఈ సంస్థవారు భారతదేశంలో నాలుగుజిల్లాలు ఎన్నికచేశారు. వీటిల్లో నల్గొండ ఒకటికావడం తనకు సంతోషదాయకంగా ఉందని శ్రీ రమేశ్ గ్రోవర్ చెప్పారు.

ఇ. ఎన్. ఎస్. పి. పబ్లిసిటీ ఆఫీసరు శ్రీ ఖేడ్కర్ ప్రసంగిస్తూ యీ సంస్థ ఆశయాలు లక్ష్యాలను వివరించి చెప్పారు. లాభనష్టాలులేని ప్రాతిపదికపైన, రసాయనిక ఎరువుల వాడకాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో ఫర్టిలైజరు ఉత్పత్తిచేస్తున్న కొన్ని పశ్చిమయూరప్ దేశాలు యీ కార్యక్రమాన్ని తలపెట్టాయి. నత్రజనిత రసాయనిక ఎరువులను సక్రమంగా ఉపయోగించే విషయమై రైతులకు తెలియజేయడమే యీ కార్యక్రమం ముఖ్యోద్దేశం. వివిధ రాష్ట్రాలలోని వ్యవసాయ శాఖల సహాయంతో 1970–71 లో ఎక్కువ దిగుబడినిచ్చే ఆహారపంటల విషయంలో భారతదేశంలో సుమారు 200 ప్రయోగాత్మకమైన కార్యక్రమాలు అమలుపరచడానికి ఇ. ఎన్. ఎస్. పి. తలపెట్టిందని శ్రీ ఖేడ్కర్ చెప్పారు.

సీనియర్ అగ్రానమిస్టు డా. టాండన్ ప్రసంగిస్తూ, నల్గొండ, సూర్యాపేట, హుజూరునగర్, మిర్యాలగూడా తాలూకాలలో 41 ప్రయోగాత్మక కార్యక్రమాలు నిర్వహించబడుతాయని చెప్పారు. రసాయనిక ఎరువులవాడకం విషయమై రైతులకు తెలియజెప్పినట్లయితే, వారు ఆ ప్రకారంగా నడచి అధిక పంటలు సాధించడానికి వీలుకలుగుతుందని చెప్పారు.

అంతకుముందు శ్రీ చక్రపాణి అతిథులకు స్వాగతం చెప్పారు. ఇ. ఎన్. ఎస్. పి. కార్యక్రమాలు నల్గొండలోనేకాక హర్యానాలో గిర్గాంపు, ఉత్తరప్రదేశ్‌లో అలిఘర్, మైసూరులో గుల్బర్గా జిల్లాల్లో అమలు జరుగుతున్నాయని తెలిపారు.

పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ ఓంకారం వందన సమర్పణ చేశారు.

## ఆదిలాబాదు ఆసుపత్రికి రూ.2 లక్షలు మంజూరీ

ఆదిలాబాదులో జిల్లా ఆసుపత్రి భవన నిర్మాణానికి ప్రభుత్వం రూ. 2 లక్షలు మంజూరుచేసిందని జిల్లా కలెక్టరు శ్రీ అల్లాయార్ ఖాన్ చెప్పారు.

ఇటీవల ఆరోగ్యశాఖామంత్రి శ్రీ మొహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ ఈ జిల్లాను సందర్శించినప్పుడు ఇక్కడ ఆసుపత్రి భవనం ఒకటి వుండవలసిన అవసరాన్ని గుర్తించారు. ఇప్పుడు ఈ ఆసుపత్రి సిబ్బందికీ, ప్రజలకూ ఇబ్బందులు కలుగుతున్నాయి. ఈ విషయాన్ని గుర్తించి మంత్రి కొత్తభవన నిర్మాణానికి సాధ్యమైన సహాయం చేయడం జరుగుతుందని రోగడ హామీ ఇచ్చారు.

## మెట్టపల్లిలో మొక్కల రక్షణలో శిక్షణ కార్యక్రమం

కరీంనగరం జిల్లా మెట్టపల్లి పంచాయతీ సమితి ఆఫీసులో జూలై 27 నుంచి జూలై 31 వరకు మొక్కల రక్షణ విషయమై శిక్షణ తరగతులు నిర్వహించబడి నాయి. అనేక పంటలు పండించునపుడు మొక్కలరక్షణ విషయమై రైతులకు, తగిన శిక్షణ ఇచ్చే ఉద్దేశంతో ఈ తరగతులు ఏర్పాటు చేయబడినాయి. ఎన్నుకోబడిన రైతులు, విలేజి లెవల్ వర్కర్లు ఇందులో పాల్గొన్నారు. జగిత్యాలలోని జిల్లా వ్యవసాయ శాఖాధికారి శ్రీ కె. రామచంద్రారెడ్డి ఈ శిక్షణ కార్యక్రమం యొక్క ఆశయాలను, లక్ష్యాలను వివరించి చెప్పారు.

హైదరాబాదులోని ప్లాంట్ ప్రొటెక్షన్ ఆఫీసరు పంటలకు వచ్చే తెగుళ్ళను గురించీ, వాటిని నిర్మూలించడానికి తీసుకోవలసిన చర్యలను గురించీ మాట్లాడారు. సకాలంలో క్రిమి సంహారక మందులు ప్రయోగించి తెగుళ్ళను అదుపులోకి తేవలసిన అవసరాన్ని గురించి ఆయన చెప్పారు.

మెకానికల్ సూపర్‌వైజర్ శ్రీ శ్రీనివాసరావు మొక్కల రక్షణ పరికరాలను ఉపయోగించే పద్ధతులను తెలియజేశారు.

## విద్యుచ్ఛక్తి ఉపకేంద్రానికి భూమి విరాళం

మహబూబునగర్ జిల్లా మద్దూరుపంచాయతీ సమితిలోని కోస్గీ పట్టణానికి చెందిన శ్రీమతి రాణీ రత్నమ్మ, కోస్గీలో విద్యుచ్ఛక్తి ఉపకేంద్రం నిర్మాణానికి మూడు ఎకరాల భూమి విరాళంగా యిచ్చారు. నిర్మాణం పనులు త్వరలోనే ప్రారంభిస్తారు.

## హరిజన హాస్టల్ ఏర్పాటు

మహబూబునగర్ జిల్లా, కోస్గీలో ఉన్నత పాఠశాల విద్యార్థుల నిమిత్తం హరిజన హాస్టల్ ఏర్పాటు చేయడానికి సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరు అనుమతించారు. ఇందులో 30 మంది విద్యార్థులకు వసతి కల్పించవచ్చు.

## హరిజనులకు ఆర్థిక సహాయం

చిత్తూరుజిల్లా సత్యవేడు బ్లాకులోని వరదాయపాలెం గ్రామానికి చెందిన 32 మంది హరిజనులకు గృహనిర్మాణం నిమిత్తం రూ. 50 ల చొప్పున ఆర్థిక సహాయం అందజేయబడింది.

చంద్రగిరి సబ్ కలక్టరు శ్రీ పి. సత్యనారాయణరావు యీ మొత్తాలను పంపిణీచేశారు. ఈ సందర్భంగా జరిగిన సమావేశంలో బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ ఎన్. నాగయ్య ప్రసంగిస్తూ హరిజన వాడకు చెందిన 38 హరిజన కుటుంబాలకు ఇండ్ల స్థలాల పట్టాలను పంపిణీచేసినట్టు పేర్కొన్నారు.

## నల్గొండ జిల్లాలో అదనంగా 2 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం

హైదరాబాదులోని లఘు పరిశ్రమల విస్తరణ శిక్షణ సంస్థకు చెందిన అభ్యర్థుల బృందం జులై 25 నుండి 28 వ తేదీ వరకు భోనగిరి, నాగార్జునసాగర్, మిర్యాలగూడెం, సూర్యాపేట, ఆలేరు, గడ్డిపల్లిలలో పర్యటించారు.

జిల్లా కలక్టరు శ్రీ రమేష్ గ్రోవర్, నల్గొండ జిల్లాలోని వ్యవసాయ, పారిశ్రామిక వనరులను గూర్చి అమలు జరుగుతున్న వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి వివరించారు. ఈ సంవత్సరం ఆఖరునాటికి అదనంగా 2 లక్షల ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం కల్పించబడుతుందని ఆయన చెప్పారు. భోనగిరి, రామన్నపేట, నల్లగొండ తాలూకాలవంటి వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక పథకాలను రూపొందించాలని కలక్టరు అన్నారు. వ్యవసాయ ఉత్పత్తులను వినియోగించుకోడానికి లఘు పరిశ్రమలశాఖ తగిన పథకాలను రూపొందించాలని ఆయన సూచించారు.

జాతీయం చేయబడిన వివిధ బ్యాంకులకు చెందిన 16 మంది శిక్షణపొందే అభ్యర్థులు, పరిశ్రమలశాఖకు చెందిన అధికారులు యీ బృందంలో ఉన్నారు.

## యాత్రా కేంద్రంగా నాగార్జునసాగర్ అభివృద్ధి

నాగార్జునసాగర్ సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ ఎం. గోపాలరావు అమెరికా, కెనడా, జపాను దేశాలలోని ఇరిగేషన్ ప్రాజెక్టులు, పారిశ్రామిక ప్రాముఖ్యాన్ని గురించి విజయవిహార్ అతిథి గృహంలో జరిగిన సభలో ప్రసంగించారు. ఆయన ఇటీవల యీ దేశాలలో పర్యటించారు. ఆ సందర్భంలో ఆయన నాగార్జున సాగర్‌ను, నాగార్జున కొండను అంతర్జాతీయ స్థాయి కలిగిన యాత్రాకేంద్రాలుగా అభివృద్ధి పరచవలసిన అవసరాన్ని గూర్చి నొక్కి చెప్పారు. యాత్రిక శాఖామంత్రి, అధికార్లు ఇదితరులు సభకు హాజరయ్యారు.

శ్రీ గోపాలరావు తమ ప్రసంగం సందర్భంలో స్లైడ్లు ప్రదర్శించారు. ప్రపంచంలోని వివిధ ఆనకట్టల ముఖ్య నిర్మాణ విశేషాలను గురించి, విదేశాలలో టూరిజం అభివృద్ధిని గురించీ ఆయన వివరించారు. ఆనకట్టనుంచి జారిపడే నీటిమీద రంగు రంగుల కాంతిని ప్రసరింప జేయడంవల్ల చేకూరే ప్రాముఖ్యాన్ని గురించి ఆయన చెప్పారు. అందువల్ల ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నయాగరా జలపాతం కంటేకూడా ఎక్కువ ఆకర్షణ చేకూరుతుందని శ్రీ గోపాలరావు తెలిపారు. మహాస్తూపం వద్ద త్రవ్వకాలు జరిగిన సందర్భంలో బయల్పడిన బుద్ధుని వ్రేలి ఎముకను గురించి బాగా ప్రచారం చేయాలనీ, అందువల్ల దేశవిదేశాలకు చెందిన బౌద్ధ యాత్రికులు, ముఖ్యంగా దూరప్రాచ్య దేశాలవారు, యీ స్థలం సందర్శనకై రాగలరనీ ఆయన అన్నారు. చికాగోలోని అమెరికా జాతీయ మ్యూజియంలో, భారతదేశంనుంచి తీసుకొని వెళ్ళిన బుద్ధ విగ్రహాన్ని యాత్రికులను ఆకర్షించే విధంగా మ్యూజియం ప్రవేశం మార్గంవద్ద ఉంచారని ఆయన తెలిపారు. నాగార్జునసాగర్ వద్దగల జాతీయ బౌద్ధ మ్యూజియంను గురించి పెద్ద ఎత్తున ప్రచారం చేయవలసిన అవసరాన్ని గురించీ, యాత్రికులకు రవాణా, వసతి సౌకర్యాలను పెంపొందించవలసిన అవశ్యకతను గురించికూడా ఆయన వివరించారు. ఈ సందర్భంలో బౌద్ధుల సాంస్కృతిక కేంద్రంగా నాగార్జున కొండను అభివృద్ధి పరచాలనికూడా శ్రీ గోపాలరావు అన్నారు.

## రెవిన్యూ బోర్డు మెంబరుచే ఇండ్లకాలనీకి ప్రారంభోత్సవం

గత సంవత్సరం మే నెలలో తుఫాను ఫలితంగా ప్రజలు ఎన్నో కష్టాలు పడ్డారు. బీద ప్రజలకు సహాయం చేసేందుకుగాను గుంటూరు జిల్లాలో కొన్ని పక్కా ఇండ్ల కాలనీలు నిర్మించడం జరిగిందని ఇటీవల మేడికొండూరు గ్రామంలో రెడ్‌క్రాస్ సొసైటీవారు నిర్మించిన ఇండ్ల కాలనీకి ప్రారంభోత్సవం జరుపుతూ రెవిన్యూబోర్డు మెంబరు సభ్యులు శ్రీ ఎన్. భగవాన్‌దాస్ అన్నారు. రెడ్ క్రాస్‌సొసైటీ సభ్యుడుగా ప్రజా సేవ చేస్తున్న డా. సి. హనుమంతరావు గారిని ఆయన ప్రశంసించారు. కాలనీలు నిర్మించడం సులభం. అయితే వాటిని భద్రంగా కాపాడడం కష్టం.

ఇండ్లు సంపాదించినవారు పెరటి తోటలలో కూరగాయలు పండించాలని శ్రీ భగవాన్‌దాస్ ఉద్బోధించారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభకు జిల్లా కలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నం అధ్యక్షత వహించారు. జిల్లాలో తుఫాను బాధితుల సహాయార్థం 5,000 ఇండ్లుగల 66 కాలనీలు నిర్మించబడుతున్నాయని కలెక్టరు చెప్పారు. ఈ సంవత్సరం ఒక్కొక్క ఇంటికి రూ. 500 ల ఆర్థిక సహాయంచేసి మొత్తం 2,000 ఇండ్లు నిర్మించడం జరుగుతుందనికూడా ఆయన చెప్పారు.

అమెరికాలోవున్న ఆంధ్రులు తుఫాను బాధితుల సహాయార్థం 5,000 డాలర్లు విరాళమిచ్చారని శాసన సభ్యులు శ్రీ వి. గోపాల కృష్ణయ్య తెలిపారు. ఇప్పుడు ఇండ్లలో చేరినవారు వాటిని విక్రయించకూడదని హితవు చేశారు. ఇక్కడి హరిజనులందరికీ ఇండ్ల స్థలాలు కేటాయించడం జరిగిందనీ యీ సమితి మాజీ అధ్యక్షులు శ్రీ ఓ. కోటి రెడ్డి తెలిపారు.

రెడ్ క్రాస్ సంస్థ కార్యదర్శి శ్రీ ఉమా మహేశ్వర రావు అతిథులకు స్వాగతం చెబుతూ, రూ. 55,900 ల ఖర్చుతో 45 ఇండ్లు నిర్మించడం జరిగిందని చెప్పారు.

సభానంతరం శ్రీ మృత్యుంజయ రావు వందన సమర్పణ చేశారు.

## వికలాంగులకు పునరావాస సౌకర్యాలు

హైద్రాబాదులోని వికలాంగుల పునరావాస కేంద్రం 1970 జూన్ నెలలో 27 మంది వికలాంగులకు వృత్తులను గురించి కొన్ని సూచనలు సలహాలు ఇచ్చింది. 14 మంది వికలాంగులకు వృత్తి విషయంలో శిక్షణ ఇవ్వడానికి వారు యీ కేంద్రంలో చేర్చుకోబడినారు. వీరిలో ముగ్గురు స్త్రీలు కూడా ఉన్నారు.

ఇంతవరకు యీ శిక్షణ కేంద్రంలో 309 మంది వికలాంగులు 63 మంది చెవిటివారు 35 మంది గ్రుడ్డివారు ఉన్నారు. 1970 జూన్ నెలలో 8 మంది వికలాంగులకు ఉద్యోగాలు లభించాయి. వీరిలో 5మంది ప్రభుత్వ రంగంలోను ముగ్గురు ప్రయివేటు రంగంలో పనిచేస్తున్నారు.

## గనులలో ప్రమాదాలు తగ్గించాలని ఉప ముఖ్య మంత్రి ఉద్బోధ

నెల్లూరు జిల్లా, కలిచేడులోని కల్యాణ రామన్ మైకా కంపెనీలో మైకా గనుల 9 వ వార్షిక భద్రతా వారోత్సవాల ముగింపు కార్యక్రమాన్ని ఉప ముఖ్య మంత్రి శ్రీ జె. వి. నర్సింగ రావు మొన్న ప్రారంభిస్తూ గనులలో జరిగే ప్రమాదాలలో నూటికి 90 వంతులు భద్రతా నియమావళిని పాటించకపోవడంవల్లనే జరుగుతున్నాయని చెప్పారు. భద్రతా పద్ధతులను గని కార్మికులకు తెలియజేసే ఉద్దేశంతో వార్షిక భద్రతా వారోత్సవాలు జరగడం చాలా హర్షదాయకమైన విషయం. ఇలాంటి కార్యక్రమాలవల్ల ప్రమాదాలు తగ్గే అవకాశాలు హెచ్చుగా ఉంటాయని ఆయన చెప్పారు.

ఉప ముఖ్య మంత్రి ఇంకా ఇలా అన్నారు: ఆంధ్ర ప్రదేశ్‌లో ఖనిజ సంపద సమృద్ధిగా వుంది. భారత దేశంలో ఉత్పత్తి అయ్యే మొత్తం ఖనిజ సంపదలో 5 వ వంతు ఈ రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది. ఇక్కడ 20 శాతం మైకా ఉత్పత్తి అవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవల మైకా వుత్పత్తి తగ్గు ముఖం పట్టడం ఆందోళనకరమైన విషయం. సాంకేతిక నిపుణులు ఈ విషయమై క్షుణ్ణంగా పరిశీలించి ఉత్పత్తి హెచ్చడానికి తగిన పద్ధతులను సూచించాలి. మైకా ముడి సరకు యొక్క నాణ్యతను ఎక్కువ చేసినట్లయితే ఈ సరుకుకు మార్కెటులో మంచి గిరాకీ ఏర్పడడానికి అవకాశం కలుగుతుంది. నెల్లూరు జిల్లా గనుల ప్రాంతాలలో సమ్మెలు లేకపోవడం చాలా సంతోషకరమైన విషయం. గని కార్మికులూ యజమానులూ ఉత్పత్తిని అధికంగా సాధించి దేశ సౌభాగ్యానికి కృషి చేయాలి.

కోలారు బంగారు గనుల మైన్స్ సేఫ్టీ డైరెక్టరు శ్రీ రామనాథన్ ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

ఈ సందర్భంగా ఏర్పాటైన వివిధ పోటీలలో గెలుపొందిన వారికి ఉపముఖ్యమంత్రి బహుమతులు పంచిపెట్టారు.

## భారీ నీటి పారుదల ప్రాజెక్టులకు రూ 130 కోట్లు అవసరం

నాగార్జునసాగరు ప్రాజెక్టు మొదటిదశ పూర్తికావడానికి రూ. 50 కోట్లు అవసరమవుతుందని భారీనీటి పారుదల శాఖా మంత్రి శ్రీ యస్. సిదారెడ్డి కొనంకిలో ప్రసంగిస్తూ చెప్పారు.

అద్దంకిలో జవాహర్ కాలువ నుంచి జలాలు విడుదల చేస్తూ ఆయన ఈ విషయం చెప్పారు.

మంత్రి ఇంకా ఇలా అన్నారు: నాగార్జునసాగర్ ప్రాజెక్టుపైన ఇంతవరకు రూ. 160 కోట్లు ఖర్చుపెట్టడం జరిగింది. ప్రాజెక్టు మొదటిదశ 5 ఏండ్లలో పూర్తి అవుతుంది. అప్పుడు మొత్తం 20 లక్షల ఎకరాలు సాగుకావడానికి వీలు ఏర్పడుతుంది. రాష్ట్రంలో మూడు పెద్ద ప్రాజెక్టులైన నాగార్జునసాగర్, పోచంపాడు, తుంగభద్ర ఎగువ కాలవల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి రూ. 130 కోట్లు అవసరమవుతాయి.

నాగార్జునసాగరు ప్రాంతంలో ఎక్కువ ఆయకట్టు రోడ్లు నిర్మించడానికి పంచాయతీలు, సమితులు, జిల్లా పరిషత్తులు 25 శాతం విరాళమివ్వడానికి ముందుకు రావాలని మంత్రి చెప్పారు.

ఈ సందర్భంలో జరిగిన సభకు గుంటూరు జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు.

అంతకుముందు నాగార్జునసాగర్ కాలవల చీఫ్ ఇంజనీరు శ్రీ టి.ఓ. కృష్ణారావు అతిథులకు స్వాగతం చెప్పారు.

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS. ANDHRA PRADESH. HYDERABAD. AND
PRINTED BY THE DIRECTOR OF PRINTING. GOVERNMENT OF ANDHRA PRADESH. AT THE GOVERNMENT CENTRAL PRESS- HYDERABAD-24

